LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM    Visit Internet Edition @ www.zaminryot.com "e-mail editor@zaminryot.com"

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    సంపుటి : 71    సంచిక : 32    11.8.2000 శుక్రవారం    16 పేజీలు    విడిప్రతి : రూ.2.00లు    జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# కలాలకు కాసులతో సంకెళ్లు

అధికారం మనిషికి మత్తెక్కిస్తుంది; అవధులు మించిన అధికారం కళ్లు పొరలు క్రమ్మేలా చేస్తుంది అన్నది సామెత. రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పరిస్థితి అట్లానే వుంది ఇప్పుడు. ప్రభుత్వాన్ని, ప్రభుత్వ ఖజానాను ఎరగా చూపించి ఏమైనా చేయ

## చంద్రబాబు కుటిలయత్నం

వచ్చు. ఎవర్నీ అయినా లొంగదీసుకోవచ్చు అనుకుంటున్నారు ముఖ్యమంత్రి. స్వతంత్ర వ్యక్తిత్వానికి, స్వేచ్ఛా పోకడలకు పెట్టింది పేరుగా మనుగడ సాగించే పత్రికా రంగాన్ని సైతం వదలిపెట్టడం లేదాయన. పత్రికా యాజమాన్యాల వ్యాపార దృక్పథాన్ని, స్వార్థ పరత్వాన్ని తెలివిగా వాడుకొని, నిష్పక్షపాతంగా వార్తలు వ్రాసే సంపాదకులను, విలేఖరులను అణచి వేయడానికి కుతంత్రాలు పన్నుతున్నారు చంద్రబాబు నాయుడు. వాటికి బలైపోయిన తాజా సమిధ - ఆంధ్రప్రభ సంపాదకుడు శ్రీరామమూర్తి.

చంద్రబాబు ప్రలోభాలకు లొంగని అతికొద్ది మంది తెలుగు పత్రికా సంపాదకులలో శ్రీరామ మూర్తి ఒకరు. రాష్ట్ర ప్రభుత్వ విధానాలు, నిర్ణయాలపైన అత్యంత నిశిత విమర్శలు చేస్తూ సంపాదకీయాలు వ్రాసేవారాయన. దానితోపాటు ఎటికె. ప్రసాద్, డిఎన్ఎఫ్ హనుమంతరావు వంటి సీనియర్ పాత్రికేయులు విద్యుత్ ఛార్జీల పెంపు, ప్రపంచ బ్యాంకు అప్పుల వంటి సమస్యలపై వ్రాసే వ్యాసాలు ప్రచురించేవారు. లెక్కలతో సహా సోదాహరణంగా ఆ వ్యాసాలలో

తొరువ 15వ పేజీలో



ఉత్తమ పార్లమెంటేరియన్లుగా ఎన్నికైన ప్రణబ్‌ముఖర్జీ, జైపాల్‌రెడ్డిలను ఈ నెల 2వ తేది ఢిల్లీలో సన్మానిస్తున్న తిక్కవరపు సుబ్బరామిరెడ్డి. ప్రక్కన మాజీ ప్రధాని ఐ.కె. గుజ్రాల్ కూడా వున్నారు.

# విద్యుత్‌పై వాగ్బాణాలతో మొదలైన శాసన సభ సమావేశాలు

విద్యుత్ సమస్యపై ప్రతిపక్షం సృష్టించే ప్రకంపనలతో దద్దరిల్లి పోతుందనుకున్న శాసనసభ - ఆ దడబడలేవీ లేకుండా హుందాగా, గంభీరంగా ప్రారంభమైంది. ఈ శాసనసభా సమావేశాలు ఏర్పాటైంది బడ్జెట్ కోసం; కాని ప్రతిపక్షాలు ఎదురు చూసింది కరెంటుపై ప్రభుత్వాన్ని నిలదీయడం కోసం. తెలుగుదేశం సైతం అందుకు సిద్ధపడి వచ్చింది. ఇటు సిఎల్‌పినేత డాక్టర్ రాజశేఖరరెడ్డి, అటు సిఎం చంద్రబాబు కూడా ఎంతో కష్టపడి హోంవర్క్ చేశారు. రకరకాల లెక్కలు, ప్రెస్ స్టేట్‌మెంట్‌ల కటింగ్‌లు, ఇతర రాష్ట్రాల సమాచారం సేకరించారు. తమ తమ ఎమ్మెల్యేలతో అంతరంగిక సమావేశాలు జరిపి, శిక్షణ ఇచ్చారు. ఈ సన్నాహాలన్నీ చూసినవారికి అసెంబ్లీలో ఎంత గందరగోళం జరగబోతుందోనని సందేహం కల్గింది. కాని, రాజకీయ పరిశీలకుల అంచనాలు తలక్రిందులు చేస్తూ - ప్రారంభ సమావేశం నిర్వహించారు రాజశేఖరరెడ్డి ప్రభుత్వ పక్షంపై దాడికి తాను పూనుకోకపోవడమే కాదు; తెలుగుదేశం ఎమ్మెల్యేలు ఎంత రెచ్చగొట్టినా, స్పందన లేనివాడి వలె వ్యవహరించి, నిగ్రహం చూపారాయన. సమావేశాల ప్రారంభంలోనే మైసూరారెడ్డి చంద్రబాబు నాయుడుపై ప్రవేశ పెట్టిన హక్కుల తీర్మానం ప్రివిలేజ్ కమిటీకి పంపడానికి స్పీకర్ నిరాకరించినా ప్రతిఘటించలేదు. దాన్ని ఒక ఇష్యూగా పరిగణించలేదు.

కరెంట్ సమస్యపై దాదాపు రెండున్నర గంటల పాటు సుదీర్ఘోపన్యాసం చేశారు రాజశేఖరరెడ్డి తన ప్రసంగంలో ఎక్కడా పరుష పదాలు, నిశిత విమర్శనాస్త్రాలు సంధించలేదు. మంద్ర స్వరంతో, నిదానంగా తాను చెప్పదలచుకున్నదాన్ని సూటిగా చెప్పాడు. రాజశేఖరరెడ్డి ఆవేశపూరిత ఉపన్యాస శైలి తెలిసిన వారికి ఇది విచిత్రంగా కన్పించింది. ప్రభుత్వం పట్టుదలకు వెళ్లకుండా కరెంట్ ఛార్జీలు తగ్గించి తీరాలని; అది జరిగే వరకు ఉద్యమం ఆగదని; విద్యుత్ సమస్యను ఛార్జీల



## రెచ్చగొట్టినా రెచ్చిపోని వై.ఎస్.

పెంపకంతో తప్ప మరే రూపంలోనూ పరిష్కరించడం చేతకాదని ప్రభుత్వం భావిస్తే - ఛార్జీలు ఒక్క రూపాయి పెంచకుండా, రైతులకు ఉచిత విద్యుత్ సరఫరా చేస్తూ విద్యుత్ సంస్థను లాభాలతో నడిపించడానికి తమ పార్టీ సిద్ధంగా వుందని ప్రకటించాడు రాజశేఖరరెడ్డి. ప్రభుత్వానికి ఆయన విసిరిన సవాల్ ఇది. దీనికి చంద్రబాబు ఏ రీతిలో సమాధానం చెప్పబోతాడో వేచిచూడాలి. కాంగ్రెస్ సభ్యులు వాకౌట్‌లు, అరుపులు, కేకలు వంటి వాటికి పాల్పడరాదని, తద్వారా అసలు సమస్యను ప్రక్కదారి పట్టించవచ్చని చంద్రబాబు తలపోశాడని పత్రికలు అంచనా కట్టాయి. కాని ఈ సభలో అటువంటి సంఘటనలేవీ జరగలేదు. రాజశేఖరరెడ్డిని విమర్శిస్తూ పదేళ్ల క్రింద జెసి. దివాకర్‌రెడ్డి ఇచ్చిన పత్రికా ప్రకటనలు చదివి విన్పించి, కాంగ్రెస్ సభ్యులను రెచ్చగొట్టడానికి ప్రయత్నించారు తెలుగు ఎమ్మెల్యేలు. కాని రాజశేఖరరెడ్డి సభలోనే వుండి వాటిని వింటూ, గమ్మునుండి పోవడంతో వారి ప్రయత్నం ఫలించలేదు.

కాంగ్రెస్‌తోపాటు, ఇతర ప్రతిపక్షాలు ఇదే రీతిలో వ్యవహరించాయి తొలిరోజు. మజ్లిస్ సభ్యుడు అసదుద్దీన్ ఒవైసి కేవలం అరగంటలోపు మాట్లాడినా - అత్యద్భుత ప్రసంగం చేశారు. పార్లమెంట్ వలె శాసనసభలోనూ ఉత్తమ లెజిస్లేచర్ అవార్డు ఇచ్చే సాంప్రదాయం వుంటే - అందుకు ఒవైసీని మించిన వారు లభించరు. తెలుగులో మాట్లాడలేక పోవడం ఒక్కటే ఆయనకు కొరత. కాని ఆయన ఆంగ్లభాషా పరిజ్ఞానం అపారం. ముక్కుసూటిగా, సరళమైన భాషలో, అత్యంత సంస్కారయుత ధోరణిలో మాట్లాడడం; ఎట్టి పరిస్థితులలోనూ స్పీకర్ తనకు ఇచ్చిన గడువును శాసనసభ సాంప్రదాయాలను అతిక్రమించక పోవడం ఒవైసీ విశిష్టత. తతిమా ఎమ్మెల్యేలు ఆయన నుంచి నేర్చుకోవలసింది చాలా వుంది. ఇప్పటి కరెంట్ సమస్యపై సైతం ఒవైసీ - చంద్రబాబు సమాధానం చెప్పుకోలేని వాస్తవాలు, ప్రశ్నలు, వివరణలతో మాట్లాడారు.

ప్రతిపక్షాలు ఇదే తీరులో మొత్తం సమావేశాలు ముగిసేవరకు వ్యవహరిస్తే - ఆంధ్రప్రదేశ్ శాసనసభ యావత్ దేశానికి ఆదర్శప్రాయమౌతుంది. *

**గమనిక**

ఈ వారం జమీన్‌రైతు సంచికతో పాటు వైద్య రంగంపై విశిష్ట వ్యాసాలు ప్రత్యేకం.

... సంపాదకుడు

ఢిల్లీలో తిక్కవరపు సుబ్బరామిరెడ్డి ఏర్పాటు చేసిన ఉత్తమ పార్లమెంటేరియన్ల సన్మానసభకు విచ్చేసిన రాజకీయ దిగ్గజాలు సీతారాం ఏచూరి, ములాయం సింగ్ యాదవ్, మురళీమనోహర్ జోషి, లల్లూ ప్రసాద్‌యాదవ్, ఫోతేధార్, ఎన్.డి. తివారి.

# అందరినీ ఒక్కచోట చూడను రెండుకళ్ళు చాల లేదు!

ఎల్.కె. అద్వానీ వంటి వారు వస్తున్నారంటే, వేలాది జనం గంటల పర్యంతం రోడ్ల మీద నిలబడి ఎదురు చూడాలి; ఫారూఖ్‌ఖాన్, శత్రుఘ్న సిన్హా, విజయశాంతి, శ్రీదేవి వంటి సినీ తారలు ఆటోగ్రాఫ్ ఇస్తే చాలు, జన్మ తరించి నట్లు ఆనందపడే అభిమానులు కోట్ల సంఖ్యలో వుంటారు; ములాయం సింగ్ యాదవ్, లల్లూప్రసాద్ యాదవ్ వంటి అహంకారం మూర్తీభవించిన నేతలతో కలయిక చాలా మందికి వూహాకందని విషయం; చంద్రశేఖర్, గుజ్రాల్ వంటి మాజీ ప్రధాన మంత్రులను కలవాలంటే ఎస్‌పిజి సెక్యూరిటీ దాటుకుని వెళ్లడం అందరికీ సాధ్యం కాదు; ప్రభాత్ కుమార్ వంటి కేంద్ర కార్యదర్శుల అపాయింట్‌మెంట్ కోసం కేంద్ర మంత్రులు కూడా రోజుల తరబడి ఎదురు చూస్తుంటారు; అమెరికా, జర్మనీ వంటి దేశాల రాయబారులు సాధరణ ప్రజలతో అసలు కలవనే కలవరు. కాని వీరందరు, ఇటు వంటి వారు ఇంకా మరెందరో ఒక విశాలమైన గదిలో గంటల తరబడి, తమ ఐశ్వర్యం, హోదా, అధికార దర్పణం, అహంకారం, అధికార పరిమితులు, జనా కర్షణ శక్తి, చివరకు సెక్యూరిటీ కూడా మర్చిపోయి గంటల తరబడి, ఒక హోట ల్‌లో, సగటు మనుషుల మధ్య, మామూ లుగా తిరగడం, కాలం గడపడం సాధ్య మా? మనవంటి వారికి అది సాధ్యమయ్యే విషయమే కాదు. కాని తిక్కవరపు సుబ్బరామిరెడ్డికి అది చాలా సులువైన పని. మొన్న 2వ తేది రాత్రి, ఢిల్లీ, తాజ్ మాన్‌సింగ్ హోటల్లో ఆయన జరిపిన చిన్న సన్మాన సభకు వచ్చిన అతిధులను చూస్తే గుండె టూరై పోతుంది. ఎవరికైనా; ఆ సభలో ఆ అతిధులు వ్యవహరించిన తీరు చూస్తేకళ్లు చెదిరి పోతాయి. సభ నిజంగా చిన్నది; ఉత్తమ పార్లమెంటేరియన్లుగా అవార్డు పొందిన ప్రణబ్ ముఖర్జీ, జైపాల్‌రెడ్డిలకు శాలువా కప్పి

## ఢిల్లీలో సంచలనం సృష్టించిన సుబ్బరామరెడ్డి సభ!

సత్కరించడం - సభ. కాని దాన్ని జరుపుతున్నది సుబ్బరామరెడ్డి కావడంతో మొత్తం ఢిల్లీ వివిపిలందరూ తరలి వచ్చారు. ఒక్కరా, ఇద్దరా... లెక్క పెట్టడానికి; గుర్తుంచుకుని చెప్పడానికి? వందలు. వేలు సంఖ్యలో వున్నారు. మాజీ ప్రధాన మంత్రులు చంద్రశేఖర్, ఐకె. గుజ్రాల్; జోషి, అరుణ్‌శౌరి వంటి బిజెపి కేంద్ర మంత్రులు ఒకటిన్నర డజను మంది; వారికి పెద్దగా కేంద్ర బిజెపి అధ్యక్షుడు కుశుభావ్ ఠాక్రే; మాధవరావు సింధియాతో మొదలుపెట్టి, ఫోతేధార్, ఆర్‌కె. ధావన్, జగదీష్‌టైట్లర్ వరకు ఢిల్లీలోని కాంగ్రెస్ పెద్దలందరూ; ములాయం, లల్లూప్రసాద్‌యాదవ్, సీతారాం ఏచూరి, సోమనాథ్ ఛటర్జీ వంటి ప్రతిపక్ష మహా నేతలు; క్యాబినెట్ కార్యదర్శి ప్రభాత్ కుమార్‌తో సహా రాజధాని ప్రభుత్వ యంత్రాంగం నడిపే సీనియర్ కార్యదర్శులు దాదాపు అందరు; కరన్ సింగ్ వంటి మాజీ మహారాజులు; దేశం మొత్తం ఎవరి పేరు చెపితే గడ గడ వణుకుతున్నారో... ఆ విజిలెన్స్ కమీషనర్ విఠల్; వినోద్‌ఖన్నా, శత్రుఘ్నసిన్హా,విజయశాంతి వంటి సినీతారలు; అమెరికా, జర్మనీ, ఇంగ్లండు, ఆస్ట్రేలియా వంటి దేశాల రాయబారులు; గోయంకా, సింఘానియా, రుయా వంటి పారిశ్రామికవేత్తలు... వీరు వారు అని చెప్పనేల... మొత్తం ఢిల్లీ కదిలి వచ్చింది ఈ సభకు. వారు రావడం ఒకటే గొప్పకాదు; వచ్చిన వారు రాత్రి పదకొండు గంటల వరకు తమను తాము మర్చిపోయినట్లు, ఆ విశాలమైన గదిలో జనంతో కల్సి పోవడం ఇక్కడ నిజంగా గొప్ప సంగతి. కేంద్ర మంత్రులతో సహా ప్రతిఒక్కరు తమ సెక్యూరిటీ సిబ్బందిని ఆ హాల్ బయట నిలబెట్టేశారు. స్వేచ్ఛగా, సాధారణ వ్యక్తుల వలె తిరిగారు. గుజ్రాల్ కాని, శత్రుఘ్నసిన్హా కాని, లల్లూప్రసాద్ యాదవ్ కాని, మాధవరావు సింధియా కాని... మనం ఎవరి ప్రక్కన నిలబడైనా, పలకరించైనా, చేయి కలిపినా, మాట కలిపినా అడిగేవారు, అడ్డగించేవాడు లేడు. మన దేశంలోని రాజకీయ వాదులు, అధికారులు ఇంత వుదారంగా జనంతో కల్సి పోవడం ఇంకెక్కడా చూడడం సాధ్యమేకాదు. అందువల్లనే, సుబ్బరామరెడ్డిని ఆ ప్రక్కరోజు జాతీయ దినపత్రికలన్నీ ఆకాశానికి ఎత్తిపారేశాయి. టైమ్స్ ఆఫ్ ఇండియా, హిందూస్థాన్ టైమ్స్, పయనీర్, ఏసియన్ ఏజ్ వంటి పత్రికలలో ఈ సభకు ఒక్కొక్క పేజీ కేటాయించి మరీ వ్రాశారు. ఒక్కొక్క పత్రికాడజను ఫోటోలు ప్రచురించింది. అందుకు కారణం, విభిన్న వర్గాల పెద్దలను ఒక్క వేదిక మీదకు తేగల్గడం సామాన్య విషయం కాదు కాబట్టి. సుబ్బరామరెడ్డికి ఇటువంటి సభలు ఒక్క సరదా. వీటి వల్ల ఆయనకు వచ్చే రాజకీయ, వ్యాపార ప్రయోజనం ఏదీ వుండదనడం నిజం. అట్లా లాభనష్టాలు చూసుకుంటే అందరితో పరిచయం అసంభవం; తమను స్వంత ప్రయోజనాల కోసం వాడుకుంటున్నారు అనే సందేహం కల్గితేనే, కేంద్ర కార్యదర్శులు, విదేశీ రాయబారులు, ప్రతిపక్ష నేతలు ఆ వ్యక్తులకు ఆమడ దూరం పారిపోతారు. సుబ్బరామరెడ్డితో అటువంటి ప్రమాదం ఏదీ వుండదన్న నమ్మకం వల్లనే ఇన్ని వర్గాల పెద్దలు ఆయన పిలవంగానే, అదొక గౌరవంగా భావించి వస్తున్నారనడం నిజం. సుబ్బరామరెడ్డి ఇప్పుడు పార్లమెంట్ సభ్యుడు కూడా కాదు; ఆయన ఆ పదవిలో వున్నది కేవలం మూడేళ్లు; అంతకు మునుపు ఆయనకు ఢిల్లీ రాజకీయ వర్గాలతో పరిచయం లేదు; కేవలం మూడేళ్ల స్వల్ప వ్యవధిలో దేశ పాలనను, భవితవ్యాన్ని, రాజకీయాన్ని, శాసనాలు శాసించే వ్యక్తులు ఇంత మందితో సాన్నిహిత్యం పెంచుకోవడం... నిజంగా ఆశ్చర్యం కల్గిస్తున్నది. సుబ్బరామరెడ్డిలో బయటకు కనపడని అద్భుత విద్య ఏదో వున్నది; అది ఆయనకు దేముడిచ్చిన వర ప్రసాదం; ఆ వరాన్ని సద్వినియోగం చేసుకోవడం కూడా ఆయనకు బాగా తెలుసు. అదృష్ట జాతకుడు. ఈ సభలో అతిధుల హాజరు కంటే అధికమైన విశేషం మరేదీ లేదు. ఉపన్యాసాలు షరా మామూలే; ఇద్దరు ఉత్తమ పార్లమెంటేరియన్లకు వెంకటేశ్వరస్వామి బొమ్మలు, జ్ఞాపికలుగా బహూకరించారు, ఖరీదైన శాలువాలు కప్పారు.

* * *

# సణుగుడు

## ◆ మొనగాడ్నే అనిపించుకొన్నాడు ఆదాల ప్రభాకరరెడ్డి!

ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి జిల్లా రాజకీయాలలో మొనగాడన్పించు కున్నాడు. మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసేనాటికి ప్రభాకరరెడ్డి రాజకీయ పసిబాలుడు. రాజకీయాలలో గుంట ఓనమాలు కూడా దిద్దక మునుపే. ఆయన్ను మంత్రిని చేశాడు చంద్రబాబు. జిల్లా మంత్రి అంటే జిల్లాలోని తతిమా తెలుగు ఎమ్మెల్యేలను సంభాళించు కోవల్సిన వాడు. తతిమా ఎమ్మెల్యేలలో రాజకీయ గజకర్ణ, గోకర్ణ, టక్కు టమారా విద్యలన్నీ ఔపోసన బట్టిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, నల్లపురెడ్డి ప్రసన్న కుమార రెడ్డి వున్నారు. పరసా రత్నం, బల్లి దుర్గాప్రసాద్ కూడా అప్పటికే మంత్రులుగా పనిచేసినవారు. ఇటువంటి సీనియర్లపైన, జూనియర్‌మోస్ట్ ఎమ్మెల్యే అయిన ప్రభాకరరెడ్డిని పెత్తనానికి పెట్టిన చంద్రబాబు ఆంతర్యం అర్థంకాక జనం జుట్టు పీక్కోవాల్సి వచ్చింది అప్పుడు. అటువంటి సందేహ జీవులందరికీ ఇప్పుడు సమాధానం చెప్పాడు ప్రభాకర రెడ్డి. జిల్లాలో ఒక్క చంద్రమోహన్‌రెడ్డి తప్ప తక్కిన తెలుగు ఎమ్మెల్యే లందరూ మంత్రి వెంటే వుంటున్నారు. వర్గాలు, విమర్శలు లేవు. పత్రికలలో వార్తలే లేవు. చంద్రమోహన్ మంత్రిగా వున్నప్పుడు ప్రతిరోజూ ఎమ్మెల్యేల మధ్య రచ్చలే; ప్రతి రోజూ పత్రికలలో వార్తల విందులే. ప్రసన్న మంత్రిగా వున్నప్పుడు రమేష్‌రెడ్డి వంటి వారితో కలబడి కొట్టు కున్న సంఘటనలు జరిగాయి. ఆ ఐదేళ్ల కాలం ముఖ్యమంత్రికి ఫిర్యాదుల పీడ తరచు తప్పేదికాదు. ఇప్పుడు అటువంటి న్యూసెన్స్ ఏదీ లేదు. తెలుగు ఎమ్మెల్యే లందరిని చాకచక్యంగా గుడ్ మూడ్స్‌లో పెట్ట గల్గుతున్నాడు మంత్రి. అంతవరకే అయితే ప్రత్యేకంగా చెప్పుకోవల్సింది లేదు; కాని ఆయన కాంగ్రెస్ ఎమ్మెల్యేలను సైతం దారిలో పెట్టుకోగల్గడమే విశేషం. కరెంట్ వుద్యమంలో ఈ విషయం బహిరంగమై పోయింది. పార్టీ పరంగా

## డోలేంద్ర

నెల్లూరు జిల్లాలో కాంగ్రెస్ చాలా బలీయమైన పార్టీ. నలుగురు ఎమ్మెల్యేలు వున్నారు దానికి. అందులో ఇద్దరు అరవై సంవత్సరాల రాజకీయ చరిత్ర కల్గిన కుటుంబానికి వారసులు; ఒకరు మాజీ ముఖ్యమంత్రి సతీమణి. జిల్లా కేంద్రం కాంగ్రెస్ అదుపులో వుంది. ఈ పరిస్థితు లలో నెల్లూరు జిల్లా కరెంట్ వుద్యమానికి కీలక స్థానం కావాలి. కాని జరుగుతున్నది అందుకు విరుద్ధం. రాష్ట్రంలో ఎక్కడా లేనంత ప్రశాంతంగా నెల్లూరులో తమ కార్యక్రమాలు జరుపుకోగల్గుతున్నారు తెలుగు నేతలు, మంత్రులు. ఇదివరకే చెప్పినట్లు నెల్లూరు టౌన్ రాష్ట్ర మంత్రు

తరువాయి 15వ పేజీలో

# కాశ్మీర్ కల్లోలం

జమ్మూకాశ్మీర్‌లో శాంతి స్థాపనకు లభించిన ఒక చిన్న అవకాశాన్ని చావు దెబ్బ తీసింది పాకిస్తాన్. కాశ్మీర్ ప్రజలు రక్తపాతాన్ని, హింసను తప్పించుకుని స్వేచ్ఛగా బ్రతకడం తనకు ఇష్టం లేదని ప్రపంచానికి ఎరుక పరిచింది.

భారత మాత శరీరంపై కాశ్మీర్ సమస్య ఒక రాచపుండు. గత పది, పదిహేనేళ్లుగా అది సలుపుతూనే వుంది. కాశ్మీర్‌ను భారతదేశం నుంచి విడదీయడానికి పాకిస్తాన్ ప్రేరేపిత ఉగ్రవాద సంస్థలు తుపాకులు చేతపట్టినప్పటి నుంచి అక్కడ శాంతి కరువైపోయింది. సరిహద్దు అవలి నుంచి పాకిస్తాన్ ప్రభుత్వం, సైన్యం, ఐఎస్ఐ వంటి సంస్థలు, ఆఫ్ఘనిస్తాన్ కిరాయి మూకలు కలిసి కాశ్మీర్‌లో నెత్తురు ఏరులు పారిస్తున్నారు. మన సైన్యం, సరిహద్దు భద్రతా దళాలు ఎంత ప్రయత్నించినా వారిని అదుపు చేయడం సాధ్యం కావడం లేదు. కాశ్మీర్ సరిహద్దు భౌగోళిక పరిస్థితులు అందుకు కారణం. చాలా దట్టమైన అడవి, మంచుకొండలు, లోయలు, చిన్న చిన్న వాగులు, నదులు వంటివి అసంఖ్యాకంగా వున్నాయి సరిహద్దుల్లో. సరిహద్దు వరకు జనం నివసిస్తున్నారు. కొన్ని వందల కిలోమీటర్ల పొడవు కలిగిన ఈ సరిహద్దుల వద్ద మన భారత దళాలు ఎంతగా కళ్లలో వత్తులు వేసుకొని కాపు కాస్తున్నప్పటికీ, పాకిస్తాన్ సైన్యం అనువు దొరికినప్పుడల్లా తీవ్రవాదులను కాశ్మీర్‌లోకి ప్రవేశ పెడుతున్నది; వారికి అత్యంత ఆధునిక మారణాయుధాలు సరఫరా చేస్తున్నది; వాటిని పేల్చడానికి తమ భూభాగంలో బహిరంగంగా శిక్షణ ఇస్తున్నది. మన సైనికులు ఎందరు ఉగ్రవాదులను మట్టు పెడితే అంతకు రెట్టింపు మందిని రంగంలోకి దింపుతున్నారు పాకిస్తాన్ ముష్కరులు. ఇదొక నిరంతర ప్రక్రియగా మారిపోయింది.

దీని వల్ల నష్టపోతున్నది కాశ్మీరీ ప్రజలే. కాశ్మీర్ రాష్ట్రంలో పరిశ్రమలు లేవు; వ్యవసాయం కూడా అంతంత మాత్రం. అక్కడి ప్రజలు ప్రధానంగా బ్రతికేది, తమ లోయలో ప్రకృతి అందాలు చూడడానికి వచ్చిపోయే విహార యాత్రికులపై ఆధారపడి మాత్రమే. కాని ఉగ్రవాద సమస్య వల్ల టూరిస్టుల రాకపోకలు తగ్గిపోయాయి. ఫలితంగా కొన్ని లక్షల మందికి ఉపాధి పోయింది. ఇంకొక ప్రక్క నిద్ర లేచిన దగ్గర నుంచి ప్రాణభయం. ఎప్పుడు ఏ వైపు నుంచి ఏ తుపాకి గుండు పైన పడుతుందో తెలియని పరిస్థితి. ప్రాణాలు పిడికిట్లో పెట్టుకుని బ్రతకడం తప్పడం లేదు వారికి. అనువు దొరికినప్పుడల్లా తీవ్ర వాదులు దారుణ మారణహోమం సృష్టిస్తున్నారు; అందుకు ప్రతీకారంగా భద్రతా దళాలు గుండ్ల వర్షం కురిపిస్తున్నాయి; మధ్యలో ప్రజల ప్రాణాలు పోతున్నాయి.

కాశ్మీర్‌ను ఈ గండం నుంచి గట్టెక్కించడానికి కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం, తీవ్రవాదులతో చర్చలకు పిలుపు ఇచ్చింది. ఆ పిలుపు వెనుక అమెరికా ప్రమేయం వున్నమాట వాస్తవమే అయినప్పటికీ, అద్వాని వంటి కరడు గట్టిన రాజకీయవాది, తీవ్రవాదులతో చర్చలకు సిద్ధపడడంలోనే, బిజెపి ప్రభుత్వ చిత్తశుద్ధిని మనం అర్థం చేసుకోవచ్చు. ఆ పిలుపుకు హిజబుల్ ముజాహిద్దీన్ సంస్థ ప్రతిస్పందించింది. తమంత తాముగా వారు 3 నెలల పాటు కాల్పుల విరమణ ప్రకటించారు. ప్రభుత్వం తక్షణమే వారితో చర్చలకు కేంద్ర కార్యదర్శులను పంపింది. రెండు రోజుల పాటు చర్చలు కూడా జరిగాయి. ఈ దశలో, చర్చలలో పాకిస్తాన్ ప్రభుత్వానికి పాత్ర కల్పించనందుకు నిరసనగా తాము ప్రభుత్వ పిలుపును తిరస్కరించి, వెనక్కు వెళ్లి పోతున్నట్లు చెప్పి మళ్లీ అండర్ గ్రౌండ్‌కు తరలి పోయారు హిజబుల్ ప్రతినిధులు.

కాశ్మీర్‌లో తుపాకులు చేతపట్టిన పలు ఉగ్రవాద సంస్థలలో హిజబుల్ ముజాహిద్దీన్ ఒక్కటే స్థానిక యువకులతో కూడుకున్నది. లష్కర్-ఇ-తోయిబా వంటి తతిమా సంస్థలన్నీ ఆఫ్ఘన్ కిరాయి సైనికులతో నడుస్తున్నాయి. అయితే హిజబుల్ నేత సలావుద్దీన్ మాత్రం పాకిస్తాన్‌లో తలదాచు కుంటున్నాడు. మరొక నేత మజీద్‌దార్ శ్రీనగర్ పరిసరాలలోనే రహస్య జీవితం గడుపుతున్నాడు. మజీద్‌దార్ మొదటగా ప్రభుత్వంతో సంబంధాలు నెలకొల్పు కున్నాడు. కాల్పుల విరమణ చేసింది, చర్చలకు ప్రతినిధులను పంపింది కూడా అతడే. మొదట ఈ ప్రతిపాదనకు సలావుద్దీన్ సైతం సమ్మతి తెలిపాడు. కాశ్మీర్ విమోచనా సంస్థల సమిష్టి సంస్థ హరియత్ కాన్ఫరెన్స్ నేతలు సైతం తొలుత చర్చలను ఆహ్వానించారు. కాని ఆ తర్వాత పాకిస్తాన్ ప్రభుత్వం వీరిపై తీవ్రమైన ఒత్తిడి తెచ్చింది. హిజబుల్‌తో పాటు హరియత్ కాన్ఫరెన్స్ కూడా ప్రభుత్వంతో చర్చలకు పూనుకొంటే, కాశ్మీర్‌లో తతిమా ఉగ్రవాద సంస్థలకు ప్రజల మద్దతు లభించడం కష్టం. వారు వెనుతిరిగి రావాల్సి వస్తుంది. అది పాక్ పాలకులకు ఇష్టం లేదు. అందుకు వారు చర్చలు అనగానే భయపడి పోయారు; తమ శక్తియుక్తులన్నీ ఉపయోగించి వాటిని విఫలం చేశారు. శాంతి ప్రక్రియ ప్రారంభించ డానికి లేక లేక ఒక్క అవకాశం దొరికింది అనే వుద్దేశంతో వాజ్‌పాయి, దాన్ని ఉపయోగించుకోవడానికి చేయని ప్రయత్నం

జమీన్‌రైతు

లేదు. ఒకటికి నాలుగు మెట్లు తాను క్రిందికి దిగి, చర్చలకు ప్రాతిపదిక రాజ్యాంగం కానవసరం లేదని కూడా ప్రకటించారు ఆయన.

కేంద్ర ప్రభుత్వం ఇంతకంటే రాజీ పడడం సాధ్యం కాదు. హిజబుల్ నేతలకు కూడా కొంత కాలం శాంతి అవసరమే. గత ఆరు నెలలలో భారత దళాలు చంపిన ఉగ్రవాదులలో అధిక భాగం ఈ సంస్థకు చెందినవారే. ఇది వరకటి వలె కాశ్మీర్ యువకులు ఇప్పుడు తీవ్రవాదంలోకి అడుగ పెట్టడానికి సిద్ధంగా లేరు. దానితో వారి సంస్థ అస్తిత్వం ప్రమాదంలో పడిపోయింది. తిరిగి బలం పెంచుకోవడానికి కొంత కాలం పోరాటం నిలపడం తప్ప వారికి గత్యంతరం లేదు. అందువల్లే వారు ప్రభుత్వంతో చర్చలకు వచ్చారనేది నిజం. ఆ నిజం తెలిసినప్పటికీ ప్రభుత్వం వారితో చిత్త శుద్ధితో వ్యవహరించింది. తీవ్రవాద ఉద్యమాలను అణచివేయడం కేవలం పోలీసుల వల్ల కాదని ప్రపంచ వ్యాప్తంగా పలు దేశాలలో రుజువయ్యింది. ఎంతో పటిష్టమైన ఇజ్రాయిల్ సైతం తమ తీవ్రవాదులతో శాంతి సంధి చేసుకోక తప్పలేదు. ఈ దృష్టితో చూసినప్పుడు బిజెపి ప్రభుత్వం చేసింది సమంజసమే. కాని ఈ అరుదైన అవకాశాన్ని పాకిస్తాన్ నేతలు భగ్నం చేశారు. కాశ్మీర్ రాష్ట్రాన్ని మరొక సారి నిప్పుల గుండంలోకి తోసివేశారు.

ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం అంతర్జాతీయ మద్దతు కూడగట్టి పాకిస్తాన్ దుశ్చర్యలు వెల్లడి చేయడం అవసరం. ఉగ్రవాదాన్ని పెంచి పోషిస్తున్నది వారే కాబట్టి ప్రపంచ సమాజం ఆ కిరాతక దేశాన్ని వెలి వేయాలని ఒత్తిడి తేగలితే తప్ప కాశ్మీర్ సమస్యకు ఎప్పటికీ పరిష్కారం లభించదు. వారు తమ భూభాగంలో ఉగ్రవాదులకు ఆశ్రయం కల్పించడం మానివేస్తే, కాశ్మీర్ సమస్య చిటికెలో పరిష్కారమౌతుంది. అప్పటి వరకు ఎన్ని చర్చలు జరిపినా వ్యర్థమే. చర్చల విఫలానికి హిజబుల్ నేతల వెన్నుపోటు వైఖరే కారణమని అమెరికా ప్రభుత్వం ప్రకటించడం శుభావహం. పాశ్చాత్య దేశాలు ఇప్పుడిప్పుడే నిజాలు తెలుసుకుంటున్నాయి. వారికి మరిన్ని వాస్తవాలు ఎరుక పరిచి, పాకిస్తాన్‌ను ఒంటరి చేయడం మన దౌత్య సమర్థతపై ఆధారపడి వుంటుంది.

***

## జమీన్‌రైతు

11.8.50

వెల: 0-2-0 పేజీలు: 12

### నెల్లూరు పంచాయతీ ఎన్నికలు

నెల్లూరు జిల్లాలో ఒకసారి ఎట్లనో ప్రాంతంగా పరిష్కారమై పోయిన కాంగ్రెస్ పంచాయతీ ఎన్నికల హడావిడి పాటిల్ పుణ్యమా అని కాదు రామకృష్ణారెడ్డి ధర్మమా అని తిరుగా సంప్రాప్తించాయి.

కోవూరుతాలూకాలో జనమడుగు, రాజుపాళెం, మోపూరు, అల్లూరు, అల్లూరుపేట, సింగపేట, బొడ్డువారిపాళెం, తురుమెళ్ల, కొత్త వంగల్లు, ఊటుకూరు, యల్లాయపాళెం పంచాయతీలు ఎన్నికలకు నిలిచాయి. 46 స్థానాలకు 112 మంది పోటీ.

అల్లూరు పేటలో మధ్యాహ్నం రెండు గ్రూపుల వారి మధ్య ఘర్షణ బయలుదేరి, రామకృష్ణారెడ్డి పక్షంవారు, ఎదుటి పక్షంవారిని కొట్టడంలో గందరగోళం జరిగి, ఒక స్త్రీకి, మరికొరికి మంచి దెబ్బలు తగిలి, పోలీస్ జోక్యం కల్పించుకొని సర్దిరంట. అప్పట ఆ తర్వాత ఎన్నికలు నిల్పుదల చేయబడినవి.

మోపూరులో సాయంకాలం బాలెట్ కాగితాలన్నీ ఒక దగ్గర పెట్టి వుండగా, ఎవరో ఒక వ్యక్తి వచ్చి లాగుకొని పరుగెత్తి పోయాడట. ఈ పంచాయతీకి సంబంధించి తలమంచి కేంద్రంలో ఎన్నికలు సక్రమంగా జరిగి పోయ్యాయి.

### మోపూరు వడ

మైసూరు వడ, కంచి ఇడ్లీ బొంబాయి చట్నీ, కలకత్తా రసగుల్లా అనేవి యిక్కడ చేసేవి అయినా అక్కడి పేర్లు పెట్టుకొంటుంటారు. వస్తువులు రుచించినా పేర్లు రుచించక వస్తువు పేరు రుచించేట్టు 'మోపూరు వడ' అని వాడుతున్నందుకు క్షమింతురుగాక. దేశంలో నేతితో చేసే

50 ఏళ్లక్రితం ఈ వారం

పదార్థాలే నశించి పోయినవి. అక్కడక్కడ హోటళ్ల ముందు నేతితో చేసిన ఫలహారములు అని బోర్డులోనే గాని వస్తువుల్లో యిక్కడా లేవు.

గాంధీనగరు బస్టాండు వద్ద లక్ష్మీనరసమ్మ హోటలని ఒకటుండేది. అవి అన్ని పదార్థాలు స్వచ్ఛమైన నేతితో చేసేది. కచేరి ఉద్యోగులు, బస్ ప్రయాణీకులు, ఇతరులు, తమ పనులు మానుకొనైనా ఆహారనకు ముగ్గులయ్యేవాళ్లు. ఏదీ యిప్పుడు అలాటి హోటలు?

నెల్లూరులో అన్ని హోటళ్లను కోరినాము నేతితో పదార్థాలు ప్రారంభించమని. ఎవ్వరూ ముందుకు రాలేదు. కోమలవిలాసు

తరువాయి 14వ పేజీలో

## జనవాణి

# శివసైనికుల బాటలో తెలుగు సైనికులు

ఆంధ్రప్రదేశ్ సింగపూర్, జపాన్ వలె మార్పు చెందడం ఏమోగాని, మరో ముంబాయిలా తయారు కావడానికి సిద్ధంగా వుంది. విద్యుత్ ఛార్జీలకు వ్యతిరేకంగా ధర్నాలు చేస్తున్నవారిని, ముఖ్యమంత్రి పాల్గొనే జన్మభూమి, ఇతర సభల్లో నిలదీసేవారిపై తెలుగుసేన కార్యకర్తలు అక్రమంగా దాడికి పూనుకొంటున్నారు. దీనికి విజయవాడలో జరిగిన సంఘటనలే ప్రత్యక్ష తార్కాణం. ముఖ్యమంత్రి తెలుగుసేన లేదని ప్రకటించినా, కడప, విజయవాడల్లో వాళ్లు బ్యాడ్జీలు పెట్టుకొని మరీ ప్రత్యక్ష మయ్యారు. బొంబాయిలో శివసైనికుల మాదిరి ఆంధ్రాలో తెలుగుసేన కార్యకర్తలను తయారు చేయాలనుకొంటున్న ముఖ్యమంత్రి మదిలోని నిర్ణయం సహేతుకం కాదు.

హైదరాబాద్ — ప్రొఫెసర్ నాగరాజారావు

### అసమర్థ ప్రభుత్వాలు

20ఏళ్లుగా గంధపు చెక్కలు, ఏనుగు దంతాల స్మగ్లర్ వీరప్పన్ ను తమిళనాడు, కర్నాటక ప్రభుత్వాలు అదుపులోకి తీసుకోలేక పోయాయంటే వాటి అసమర్థతనుఅర్థం చేసుకోవచ్చు. దీనివల్లే అతను కన్నడ సూపర్ స్టార్ రాజ్‌కుమార్‌ను కిడ్నాప్ చేసి తీసుకెళ్ల గలిగాడు. 500కోట్ల వ్యయాన్ని ఒక వ్యక్తిని పట్టుకోవడం కోసం రెండు రాష్ట్ర ప్రభుత్వాలు వెచ్చించాయంటే అంతకన్నా నామర్దా తనం లేదు. రాజ్‌కుమార్ విడుదల తర్వాత, ఈ విషయమై కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధతో ఒక కార్యక్రమం రూపొందించి వీరప్పన్‌ను అరెస్ట్ చేయాలి.

నెల్లూరు — జె.పోలిరెడ్డి

### బిట్రగుంట లోకోషెడ్ గూర్చి పట్టించుకోండి

దేశంలోని రెండవ అత్యుత్తమ రైల్వే స్టీమ్ ఇంజన్ల షెడ్‌గా ప్రసిద్ధి చెందిన బిట్రగుంట రైల్వే లోకోషెడ్ ఎలక్ట్ ఇంజన్ల రాకతో క్షీణదశకు చేరుకొంది. ఈ లోకో షెడ్‌ను పూర్వ వైభవానికి తెస్తామని అన్ని రాజకీయ పార్టీల నాయకులు ఎన్నికల సమయాల్లో వాగ్దానం చేయడమేగాని పట్టించుకోవడం లేదు. బిట్రగుంటలో 2వేల ఎకరాల రైల్వే భూమి, 600 ఎకరాల రాష్ట్ర ప్రభుత్వ బంజరు భూమి, వెయ్యికిపైగా రైల్వే క్వార్టర్లు, ఇన్‌స్టిట్యూట్, హాస్పిటల్, పార్కు, ఇంగ్లీషు తెలుగు మీడియం స్కూళ్లు, ఫుట్‌బాల్ గ్రౌండ్లు వున్నాయి. లోకోషెడ్ విషయమై 1997లో అల్లూరు ఎమ్మెల్యేగా వుండిన విష్ణువర్ధనరెడ్డి రైల్ రోకో కార్యక్రమం చేపట్టారు. కాని ఫలితం లేదు. 12వ లోకసభలో నెల్లూరీయులు ఐదుమంది ఎమ్పీలుగా వున్నా ఈ సమస్య గూర్చి పట్టించుకోవడం లేదు. ప్రస్తుతం ఎమ్మెల్యేగా గెలిచి, ఇళ్లమంత్రి అయిన ఆదాల ప్రభాకరరెడ్డి లోకోషెడ్ గూర్చి పట్టించుకొంటానన్నారు. రైల్వే బోర్డులో తెలుగుదేశం పార్టీ పార్లమెంటరీ నాయకుడు ఎర్రం నాయుడుకు వున్న పదవిని దృష్టిలో పెట్టుకొని షెడ్‌లో ఏదో ఒక యూనిట్‌ను పెట్టించే ప్రయత్నం చేయాలి. లేకుంటే లోకోషెడ్ గత వైభవానికి గుర్తుగానే మిగులుతుంది.

బిట్రగుంట — సి.హెచ్. సాల్మన్‌రాజు

### ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని ప్రయాణం

పొదలకూరు రోడ్డులోని కొత్తూరు వరకు టౌన్‌బస్సులో ప్రయాణం చేయాలంటే ప్రాణాలు అరచేతిలో పెట్టుకోవాల్సి వస్తుంది. ఈ రూటు మధ్యలో వున్న క్రైస్ రోడ్డు సెంటర్‌లో డ్రైవర్లు దిగిపోతారు. డ్రైవింగ్ వచ్చీరాని క్లీనర్లు అక్కడి నుండి బస్సులు

తరువాయి 14వ పేజీలో

# ఆదాలతో 'అక్రమ 'సంబంధం లేదు!

నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, జిల్లామంత్రి ఆదాల ప్రభాకరరెడ్డితో మిలాఖత్ అయ్యి నెల్లూరు జోన్‌లో కొన్ని జన్మభూమి కార్యక్రమాల్లో పాల్గొన్నారన్న విషయమై రేగిన విమర్శలపై ఆయన తీవ్రంగా ప్రతిస్పందించారు.

## వివేకా స్పష్టీకరణ

ఈ విషయమై 7వతేదీ విలేఖరుల సమావేశం ఏర్పాటు చేసి మాట్లాడారు. ప్రజా సమస్యల పరిష్కారం కోసం నిత్యం రాజీలేని పోరాటం చేయడమే నాతత్వం; అంతేకాని ఎవరి మెప్పుకోసమో లాపత్రయపడి ఏనాడు ఉద్యమాలు చేయలేదు. నాకు తెరచాటు రాజకీయాలు తెలియవు. ఏది చేసినా బహిరంగంగానే చేస్తాను. ఈ నెల నాల్గవతేది జిల్లామంత్రి ఆదాల ప్రభాకరరెడ్డితో కలసి పాల్గొన్న కార్యక్రమాలకు, జన్మభూమి కార్యక్రమాలకు అసలు సంబంధం లేదు. అవి మునిసిపల్ అభివృద్ధి కార్యక్రమాలు. అన్ని పార్టీల కౌన్సిలర్లు కలసి ఈ ప్రారంభోత్సవాల్లో పాల్గొనమని నన్ను ఆహ్వానించారు. మంత్రి పాల్గొనే తేదీ అప్పటికి ఖరారవ్వడంతో, గత్యంతరం లేక హాజరయ్యాను. దీన్ని ఆసరాగా తీసుకొని మంత్రితో నాకు ప్రత్యేక సంబంధాలు వున్నాయంటే ఎలా? నాకు ఎవరితోనూ ప్రత్యేక సంబంధాలు, అక్రమ తగాదాలు కూడా లేవని ఎమ్మెల్యే వివరించారు. గతంలో జరిగిన జిల్లా

కొరవ 15వ పేజీలో

# మహిళా జన్మభూమి 'భేష్'

మహిళా జన్మభూమి జిల్లాలో బ్రహ్మాండంగా జరిగిందని, మహిళలు అధిక సంఖ్యలో పాల్గొన్నారని, మంచి స్పందన వచ్చిందంటున్నారు కలెక్టర్ ప్రవీణ్‌కుమార్. జిల్లాలోని 942 గ్రామ పంచాయతీలు, మూడు మునిసిపాలిటీల్లో ఈ నెల 1వతేది నుంచి 7వతేది వరకు జరిగిన గ్రామసభల్లో 31,576మందికి 189లక్షల రూపాయలు పింఛన్లుగా ఇచ్చారట. ఇందులో 3344 వితంతు పింఛన్లు, 29715 మందికి వృద్ధాప్య పింఛన్లు వున్నాయి. 13వ విడత జన్మభూమి కార్యక్రమంలో పేద, బలహీన వర్గాల వారికి 199.62లక్షల రూపాయల విలువగల 2895 ఉపకరణాలను, 5689 మంది లబ్ధిదారులకు పంపిణీ చేశారట. చేయూత క్రింద 12 మంది దంపతులకు వివాహ ప్రోత్సాహక బహుమతులు పంపిణీ చేశారు. 1661 మంది మహిళలకు నివేశన స్థలాల పట్టాలు, దీపం పథకం క్రింద 4034 మంది మహిళలకు గ్యాస్ సిలిండర్లిచ్చారు. జిల్లాలో 546 పొదుపు గ్రూపులు, కొత్తగా ఏర్పాటు చేసిన 709 అర్హత గల గ్రూపులకు డ్వాక్రా పథకం క్రింద రివాల్వింగ్ ఫండ్ మంజూరు చేశారు. నేషనల్ ఫ్యామిలీ బెనిఫిట్ స్కీం క్రింద 528 మంది గర్భిణీస్త్రీలకు జాతీయ ప్రసూతి సహాయ పథకం

కొరవ 15వ పేజీలో

## నెల్లూరుసంగతులు

బెజవాడ గోపాలరెడ్డి స్మారక అవార్డును డాక్టర్ సియుంతి రెడ్డికి బహూకరిస్తున్న అల్లు రామలింగయ్య, జె.వి. రెడ్డి. ప్రక్కన కొండా బలరామిరెడ్డి, సుత్తివేలు, జె.ఒ. రెడ్డి, బి.వి. నరసింహం.

# ప్రతినెలా 342 టన్నుల బియ్యం మాయం!

నెల్లూరు జిల్లాలో రేషన్ డీలర్ల వద్ద ఉన్న బోగస్ కార్డుల వల్ల ప్రతి నెలా దాదాపు 342 టన్నుల బియ్యం దళారుల పాలవుతోంది. జిల్లాలో రేషన్ కార్డుల వ్యవహారం అబందరదబందరగా వుంది. పట్టించుకొనే ఉన్నతాధికారి లేకపోవడం వల్ల డీలర్లు ఆడిందే ఆట పాడిందే పాటగా వుంది. ఇటీవల బోగస్ రేషన్ కార్డుల ఏరివేత ప్రత్యేక కార్యక్రమాన్ని చేపట్టా జిల్లాలో 19,571 కార్డులు పట్టుబడ్డాయి. వీటిలో ఎక్కువ శాతం కార్డులు రేషన్ డీలర్ల వద్దే పట్టుపడడం విశేషం. వీటిలో 14,064 తెల్లకార్డులుండడం విశేషం కాగా. ఈ కార్డులు రద్దు చేయడం వల్ల 172 టన్నుల సబ్సిడీ బియ్యం ప్రభుత్వానికి ఆదా అయ్యింది. ఇటీవల

## బోగస్‌కార్డులతో డీలర్ల మాయాజాలం

నిర్వహించిన హౌస్ హోల్డ్ సర్వే జిల్లాలో 5,94,824 కుటుంబాలు మాత్రమే వున్నట్లు లెక్కతేలగా, రేషన్ కార్డులు మాత్రం 6,31,718 వినియోగంలో వున్నాయి. జిల్లాలో నివసిస్తున్న కుటుంబాల కంటే కార్డులు ఎక్కువ చలామణిలో ఉండడానికి రెవిన్యూ శాఖాధికారులు, చూసీచూడనట్లు పోతుండడమే కారణమనాలి. దీనివల్ల ప్రభుత్వానికి ప్రతినెలా 342 టన్నుల బియ్యం బ్లాక్ మార్కెట్‌కు దర్జాగా తరలిపోతోంది. ఇవి వాస్తవంగా ప్రజల వద్ద వుంటే పెద్దగా చెప్పుకోనక్కరలేదు. ఈ బోగస్ కార్డులన్నీ డీలర్లే తమ వద్ద అట్టిపెట్టుకొని నెలనెలా వేలాది రూపాయలు సరుకులు బ్లాక్ మార్కెట్‌కు తరలిస్తూ లాభం పొందుతున్నారు. పౌరసరఫరా, రెవిన్యూ శాఖాధికారులకు మామూళ్లు పారేస్తుండడంతో వీరు గుర్తించి వాళ్లు పట్టుకోకపోవడమే మాసారం. కాని ఇంతకు ముందు గన్యాడ కలెక్టర్‌గా పనిచేసిన క్రిష్ణ గొందు ప్రత్యేక అధికారులను నియమించి ఈ విషయమై డ్రైవ్ చేపట్టి జిల్లాలోని 19,571 బోగస్ కార్డులు బయటపడ్డాయి. నెల్లూరు జోన్‌లో 7,197 గూడూరులో 4,324 మిగతా గ్రామీణ ప్రాంతాల్లో బయటపడ్డాయి. జిల్లాలో 50వేలకు పైగా బోగస్ కార్డులున్నాయని గతంలో జాయింట్‌కలెక్టర్ ఎన్నోసార్లు చెప్పింది. అధికారుల లెక్కల ప్రకారమే కుటుంబాలకు మించి అదనంగా ప్రస్తుతం 17,143 కార్డులున్నాయి. మళ్లీ ఒక ప్రత్యేక సర్వే జరిపితే 25వేలకు పైగా బోగస్ కార్డులు బయటపడతాయనవచ్చు. దీన్ని 20వేలకు పైగా కార్డులు డీలర్ల వద్దే వున్నాయని నిర్ధారణగా చెప్పవచ్చు. ఈ ఏరివేత

కొరవ 15వ పేజీలో

# పళ్లకు మరమ్మతులు - అందాలకు మెరుగులు

దంత వైద్యంలో చాలా ఆధునిక ప్రక్రియలు వచ్చాయి. పిప్పి పళ్లు పీకడం, కట్టుడు పళ్లు కట్టడం మాత్రమే దంత వైద్యులు చేసే పని అనే అభిప్రాయం కలిగిన వారికి, ఈ వైద్యంలో వచ్చిన కొత్త కొత్త మార్పులు చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. అటువంటి నవీన పద్ధతులన్నిటినీ సమగ్రంగా నేర్చి, అందుకు అవసరమైన శిక్షణను పొంది నెల్లూరులో ప్రాక్టీస్ ప్రారంభించిన యువ డాక్టర్ - ఎం. శ్రీనాథరెడ్డి. పాత కాలం పంటి డాక్టర్ హరిశ్చంద్రారెడ్డి గారి తనయుడు అన్నది కేవలం పరిచయం కోసం చెప్పవల్సిందే; ఆ తరానికి, ఈ తరానికి వైద్యంలో వచ్చిన అభివృద్ధి రీత్యా, అందులో శ్రీనాథరెడ్డి గడించిన ప్రావీణ్యం దృష్ట్యా చూస్తే



డా॥ యం. శ్రీనాథ్‌రెడ్డి, M.D.S., Ortho Dontist

- శ్రీనాథరెడ్డి తండ్రి హరిశ్చంద్రారెడ్డి అని పరిచయం చేయవల్సిన రోజు ఎంతో దూరంలో లేదు. ఆయన క్లినిక్ బృందావనంలో, డాక్టర్ రామచంద్రారెడ్డి ఆస్పత్రి ప్రక్కనే వుంది. పంటి వరసలు సరి చేయడం ద్వారా ముఖ అందాన్ని పెంచే కాస్మెటిక్ డెంటిస్ట్రీ శ్రీనాథరెడ్డి ప్రత్యేకత. నెల్లూరులో ఈ తరహా వైద్యం ప్రారంభించింది మొదటగా ఆయనే. దాంతో వైద్యంలో అత్యంత ఆధునిక ప్రక్రియ అయిన ఆర్థోగ్నాతిక్ సర్జరీ గురించి ఆయన చెప్పే విషయాలు చదవండి.

ఎత్తు పళ్లు, దవడల వల్ల అంద వికారంగా తయారయ్యిన ముఖానికి తిరిగి సౌందర్యం సమకూర్చడం - ఆర్థోగ్నాతిక్ సర్జరీ - ఉద్దేశ్యం. చిన్న తనంలో నోట్లో వేళ్లు పెట్టుకుని చీకే అలవాటు వల్ల కొందరిలో, వంశపారంపర్య వారసత్వంగా మరికొందరిలో ఎత్తు దవడలు వస్తుంటాయి. దవడ ఎముకల పెరుగుదలలోని అవకతవకల వల్ల ఈ సమస్య వస్తుంది. ఎదిగే వయస్సులో అయితే, కేవలం క్లిప్పుల ద్వారా వీటిని సరిచేయవచ్చు. ఆ ప్రక్రియను "గ్రోత్ మాడ్యులేషన్" అంటారు. ఒకసారి ఎముకల పెరుగుదల నిలిచిపోతే ఆర్థోగ్నాతిక్ సర్జరీ ద్వారా మాత్రమే సరిచేయడం వీలవుతుంది. నెల్లూరులో ఈ తరహా సర్జరీ చేయగల్గిన వారు డాక్టరు శ్రీనాథ్ రెడ్డి ఒక్కరు మాత్రమే. పై ఫోటో ఒకసారి చూడండి. ఈ అమ్మాయికి పై దవడ చిన్నదిగా, క్రింది దవడ పెద్దదిగా వుంది.



చికిత్సకు ముందు | చికిత్స తర్వాత

ఆర్థోగ్నాతిక్ సర్జరీ తర్వాత ఈ హెచ్చు తగ్గులు సరిచేశారు. రెండింటికి తేడా ఒకరు చెప్పాల్సిన అవసరం లేకుండానే కనిపిస్తుంది. ఈ సర్జరీ చేయబోయే ముందు స్ట్రెయిట్‌వైర్ టెక్నిక్ అనే పద్ధతిలో క్లిప్పులు తగిలించి, పళ్ల వరసలోని తేడాలు సరిచేయాలి. సర్జరీ తర్వాత కూడా కొంత కాలం క్లిప్పులు వుంచుకోవాల్సి వుంటుంది. ఈ సర్జరీ ద్వారా చిన్న దవడలు పెద్దవిగా మార్చవచ్చు, పెద్ద వాటిని చిన్నవిగా తీర్చిదిద్దవచ్చు. పై ఫోటోలో కనువడే అమ్మాయికి జరిపిన సర్జరీ పై మణిపాల్లో జరిగిన ఇండియన్ ఆర్థోడాంటిక్ కాన్ఫరెన్స్‌లో పరిశోధన పత్రం సమర్పిస్తే, దానికి ప్రథమ బహుమతి లభించింది. దాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు శ్రీనాథరెడ్డి సమర్థత. స్ట్రెయిట్ వైర్ టెక్నిక్ అనేది చాలాకొత్త ప్రక్రియ. ఎత్తు పళ్ల నవరణకు తిరుగులేని పద్ధతి. దీని ద్వారా ప్రతి పంటిని దాని స్థానంలో వుంచవచ్చు. వంకర పళ్లు వుండే వారికి ప్రతి పంటికి ఒక క్లిప్ తగిలించి, ఒక వరసలో పళ్లను అమర్చడం దీని విశిష్టత. ఈ ప్రక్రియలో క్లిప్పులు దాదాపు సంవత్సరకాలం అట్నే వుంచుకోవాలి. ఈ స్ట్రెయిట్ వైర్ టెక్నిక్ తెలిసిన డాక్టర్లు కూడా చాలా కొద్దిమంది వున్నారు; వారిలో శ్రీనాథ్ రెడ్డి ఒకరు.

# చికిత్సలేని వ్యాధికి నివారణే మార్గం

చిన్న పిల్లల పాలిట యమపాశంగా తయారైన మెదడువ్యాపు వ్యాధి ఇటీవల కాలంలో విజృంభించింది. వైద్య పరిభాషలో జపనీస్ ఎన్‌సెఫలైటిస్‌గా పిలవబడే ఈ వ్యాధిని 1955లో భారతదేశంలో మొట్టమొదటిసారిగా రాయవెల్లూరు సిఎంసి ఆస్పత్రిలో కనుగొన్నారు. వెనువెంటనే ఇది మన రాష్ట్రంలోకి ప్రవేశించి వేలాది మంది పసిబిడ్డలను బలితీసుకుంది.

"నెల్లూరు జిల్లాలో మెదడువాపు వ్యాప్తి - నివారణ" అనే అంశంపై సిమ్స్ చిన్న పిల్లల వైద్య కేంద్రం అధ్యయనం నిర్వహిస్తున్నారు. ఆ అధ్యయనంలో భాగంగా నెల్లూరు జిల్లా వ్యాప్తంగా మెదడు వాపు టీకా శిబిరాలు నిర్వహిస్తున్నారు.

మెదడు వాపు టీకా శిబిరాలు నిర్వహించడంతోపాటు జిల్లా వ్యాప్తంగా వ్యాధిపట్ల అవగాహన పెంపొందించేందుకు ఈ కార్యక్రమం దోహద పడుతుంది. అధ్యయనం నిమిత్తం విస్తృతంగా మెదడువాపు టీకాను అందించడం భారతదేశంలోనే ఇది ప్రథమం. ఈ వ్యాధి నివారణను ఒక సామాజిక ఉద్యమంగా నిర్వహిస్తున్న డాక్టర్ శ్రీధర్ నిజంగా అభినందనీయుడు, ఆదర్శప్రాయుడు.

మెదడువాపు వ్యాధికి కారణమైన వైరస్



డా॥ పి. శ్రీధర్ M.D., D.Ch. చిన్నపిల్లల వైద్యనిపుణులు

జీవిత చక్రంలో అమాయకులైన పిల్లలు బలిపశువులయ్యారు. ఈ వైరస్ సోకిన పందినీ, బాతునో కుట్టిన దోమ, 21 రోజుల జీవితకాలంలో పసిపిల్లలను కుడితే, ఆ వైరస్ శరీరంలోకి ప్రవేశిస్తుంది. 15 సంవత్సరాల లోపు పిల్లలలో ఈ వైరస్ విపరీతమైన దుష్పరిణామాలకు దారితీస్తుంది. మెదడు వాపు వ్యాధిగ్రస్తుల్లో 33.33శాతం మరణాలు సంభవిస్తాయి. మిగిలిన పిల్లలు కోలుకున్నప్పటికీ మానసిక వికలాంగులుగానో, శారీరక వైకల్యం సోకి జీవితాంతం జీవచ్ఛవాలుగా బ్రతకాల్సి వస్తోంది. ఆగస్టు, నవంబర్ నెలల మధ్య ఈ వ్యాధి విజృంభిస్తుంది.

మానవాళి పాలిట మహమ్మారిలా విరుచుకపడే మెదడు వాపు వ్యాధికి నిర్థారిత చికిత్స అంటూ ఏదీ లేదు. వ్యాధి నివారణకు 'టీకా'ల మందు వేయడమే ఉత్తమ మార్గం.

చైనా, కొరియా, జపాన్, తైవాన్ మరియు మలేసియా వంటి దేశాలు, టీకాలతో ఈ వ్యాధిని చాలా వరకు అరికట్టగలిగాయి. భారతదేశం తోపాటు వియత్నాం, కాంబోడియా, మైయాన్మార్, నేపాల్, మలేసియా వుంటి దేశాలలో ఈ వ్యాధి విజృంభణ తగ్గలేదు. వ్యాధి నివారణకు జెయివాక్సిన్ టీకాను లోగడ విదేశాల నుండి దిగుమతి చేసుకొనేవారు. ఇప్పుడు హిమాచల్ ప్రదేశ్‌లోని కసౌలీలోని సెంట్రల్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ వారు తయారు చేస్తున్నారు. మంచు పిల్లల మెదడులోకి నకయామా జెయిస్ట్రెయిన్‌ను చొప్పించి దాని నుండి ఈ

తరువాయి 9వ పేజీలో

# రక్తపరీక్షల్లో తేడా కొంపముంచుతుంది

భారతదేశంలో చక్కెర వ్యాధి నిశ్శబ్ద మారణహోమాన్ని సృష్టిస్తోంది. వైద్య సలహాలు, క్రమశిక్షణతో అదుపు చేసుకోగలిగిన ఈ వ్యాధి పట్ల అవగాహనా లోపం, నిర్లక్ష్యం వల్ల చక్కెర వ్యాధిగ్రస్తులు, మృత్యువును తమంతట తామే ఆహ్వానిస్తున్నారు. చక్కెర వ్యాధిగ్రస్తులకు వైద్య చికిత్స ఎంత ముఖ్యమో, చక్కెర శాతాన్ని



డా॥ వి.అనిల్‌కుమార్ రెడ్డి, MB., DIAB., షుగర్ వ్యాధి నిపుణులు

కనుగొనేందుకు జరిపే రక్తపరీక్షలలో శాస్త్రీయ పరమైన విధానం కూడా ప్రధానం.

చక్కెర వ్యాధిని తన వైద్య మంత్ర దండంతో సమర్థవంతంగా అదుపు చేయగల్గిన ప్రతిభావంతుడైన డాక్టర్, అనిల్‌కుమార్‌రెడ్డి, సంవత్సరంలో కనీసం రెండు నెలలైనా ప్రపంచంలో ఏ మూల చక్కెర వ్యాధిపై అవగాహన, అధ్యయన శిబిరాలు జరిగినా అందులో పాల్గొని వైద్య విధానంలో రోజు, రోజుకు వస్తున్న మార్పులను ఆకళింపు చేసుకొని నెల్లూరు ప్రజలకు అందిస్తున్న సమర్థవంతుడు. తన క్లినిక్‌లోనే అత్యాధునిక ప్రయోగశాలను ఏర్పాటు చేశారు. తరచూ మధుమేహ వ్యాధిగ్రస్తులకు అవగాహన శిబిరాలు ఏర్పాటు చేసి, వ్యాధిపట్ల తీసుకోవలసిన జాగ్రత్తలపై వారిని అప్రమత్తం చేస్తున్నాడు. షుగర్ రోగులకు అనిల్ డాక్టరే కాదు, టీచర్ కూడా.

చక్కెర వ్యాధి అంటే రక్తంలో పెరిగిన చక్కెర (గ్లూకోను) శాతం. ఈ గ్లూకోసు ఖాళీ కడుపున రక్తంలో 70-106 మి.గ్రా ఆహారం తిన్న తరువాత 90- 140 మి.గ్రాలోపు ఉండాలి. రక్తంలో చక్కెర శాతాన్ని బట్టి ఏ వ్యక్తికైనా డయాబిటిస్ ఉందోలేదో చెప్పగలుగుతారు. రక్తంలోని చక్కెర శాతాన్ని కనుగొనేందుకు రెండువేల రూపాయల నుండి 20లక్షల రూపాయల వరకు ఎన్నో పరికరాలు, యంత్రాలు, కంప్యూటరైజ్‌డ్ యంత్రాలు వచ్చాయి. దురదృష్టవశాత్తు మనదేశంలో అన్ని రకముల రక్తపరీక్షలు అనుకున్న విధంగా నాణ్యతలోను, లోపాలు లేకుండా జరగడం లేదు. దీని కారణంగా ఒక్కొక్క ల్యాబ్ లేదా హాస్పిటల్ నుంచి ఒక్కొక్కరకంగా షుగరు రిపోర్టులు రావడం జరుగుతున్నది. దీనివల్ల చాలా మంది పేషంట్లు తరచూ అయోమయానికి గురౌతున్నారు.

రక్తంలోని షుగర్ శాతాన్ని పరీక్షించే రసాయనాలు మంచివి వాడక పోవడం, ఆ పరికరాలు పాతవి కావడం, కొన్ని పరికరాలలో సామర్థ్యం కొరవడటం, ఆ పరీక్షలు జరిపే వారిలో సంబంధిత శాస్త్రానికి సంబంధించి విజ్ఞానం లేకపోవడం వంటివి కారణాలుగా పేర్కొనవచ్చు. రక్తం తీసుకొన్న వెంటనే పరీక్షలు

డా॥ శ్రీమతి రజిత, MD., రోగ నిర్ధారణ నిపుణులు

జరపడం చాలా ముఖ్యం. లేదంటె రక్తంలిన చక్కెర శాతం తగ్గిపోయి తక్కువ రిజల్టు రావచ్చు. వీటన్నింటినీ గుర్తించే అభివృద్ధి చెందిన అమెరికా, యూరప్, ఆస్ట్రేలియా, జపాన్ వంటి దేశాలలో చక్కెర వ్యాధిలో రోగనిర్ధారణ ప్రాధాన్యత పెరిగిపోయి దీనికోసం ప్రత్యేకంగా అనేక బోధన, శిక్షణా తరగతులు ఏర్పాటు చేశారు. అలాగే మనదేశంలోని అన్ని ముఖ్య

తరువాయి 9వ పేజీలో

# మూర్ఛరోగులకు జవాబు-న్యూరోపేజ్ 2300

పొగతోటలోని రవి చిన్నపిల్లల ఆస్పత్రి క్రమక్రమంలో సూపర్ స్పెషాలిటీస్ స్థాయికి ఎదుగుతుంది.

తమకు వచ్చిన వ్యాధిని చెప్పలేని నోరులేని పసి పిల్లలకు ఎంతో సహనంతోనే, నేర్పుతో, వైద్యం అందించడంలో రవి సిద్ధహస్తుడు. వైద్య రంగంలో వ్యాధి నిర్ధారణకు ఉపయోగపడే అధునాతన సాంకేతిక పరికరాలతో తన ఆస్పత్రిని విస్తరిస్తూ, ప్రజలకు కూడా అందుబాటులో ఉండే రీతిలో సేవలు అందిస్తూ, తనదైన శైలిలో రవి చిన్న పిల్లల ఆస్పత్రిని పాపులర్ చేశారు.

చిన్నపిల్లల్లో వచ్చే మూర్ఛవ్యాధికి కారణాలను సమూలంగా శోధించి గుర్తించే న్యూరోపేజ్-2300 అనే పరికరాన్ని ఇటీవల తన ఆసుపత్రిలో ప్రారంభించి మరో మెట్టుపైకెదిగారు.

మెదడులోని నరాలు అతిగా స్పందించడం వల్ల మెదడులోని ఎలక్ట్రికల్ యాక్టివిటీ పెరిగి మూర్ఛ రావడం జరుగుతుంది. ఈ వ్యాధి చికిత్సలో ఎదురయ్యే ఎన్నో సందేహాలకు అవాంతరాలను ఖచ్చితమైన సమాచారాన్ని క్షణాల్లో అందజేయగల అద్భుత ప్రక్రియే ఈ "న్యూరోపేజ్-2300" పరికరం. ఈ అధునాతన కంప్యూటరైజ్డ్ పరికరంలోని బ్రెయిన్ మ్యాపింగ్ సిస్టమ్, ఫ్రీక్వెన్సీ మ్యాపింగ్, ఓల్టేజ్ మ్యాపింగ్ సిస్టమ్ ప్రక్రియల ద్వారా బిడ్డ మెదడులోని అన్ని భాగాలను కూలంకషంగా పరిశీలించి మెదడులోని ఏ భాగంలో ఫిట్స్ ప్రారంభమైనదీ, ఎంత ఫ్రీక్వెన్సీలో వున్నదీ, మెదడులోని ఏ భాగం నుంచి ఏ వైపునకు ప్రయాణం చేస్తున్నదీ స్పష్టంగా తెలుసుకోవచ్చు. కాబట్టి పిల్లవానికి ఇచ్చే ట్రీట్మెంటుని అంతే ఖచ్చితంగా నిర్ధారించవచ్చు. ఈ "న్యూరోపేజ్ 2300" మామూలు "ఎలక్ట్రోఎన్సెఫలోగ్రామ్" కన్నా క్లినికల్ డయాగ్నసిస్‌కి మరింతగా వుపయోగపడుతుంది.

ఈ పరికరం ద్వారా బిడ్డలో కనిపించే ఫిట్స్ లక్షణాలు నిజంగా మూర్ఛవ్యాధికి సంబంధించినవా కాదా అని కూడా నిర్ధారణగా తెలుసుకోవచ్చు. ఒకవేళ అవి మూర్ఛవ్యాధికి సంబంధించిన లక్షణాలని రూఢీ అయినట్లయితే, ఫిట్స్ రావడానికి గల కారణాలు, అది ఏ రకమైన ఫిట్స్ కూడా ఖచ్చితంగా నిర్ధారించి, అందుకు తగిన చికిత్సని, చికిత్సా కాలాన్ని, అలాగే వాడుతున్న మందులు ఏవిధంగా ఎంత వరకు పని చేస్తున్నదీ లేనిదీ లేక మందులు మార్చవలసిన అవసరమున్నదీ లేనిదీ, ఎప్పుడు మందులను ఆపేయవచ్చు మొదలగు అంశాలన్నీ ఈ పరికరం సహాయంతో తెలుసుకొనే అవకాశం వుంది. వంశచరిత్రని బట్టి బిడ్డలో ఫిట్స్ లక్షణాలు కనపడిన వెంటనే.



డా॥ బి. రవికుమార్
M.D.,D.Ch.,
చిన్నపిల్లల వైద్య నిపుణులు

ఈ అధునాతన పరికరం ద్వారా పరిశీలించినట్లయితే, ప్రాథమిక దశలోనే వ్యాధిని కనుగొని సంపూర్ణంగా నయం చేయగల అవకాశం వుంది ఎందుకంటే ఈ పరికరం ద్వారా లభించే సమాచారాన్ని బట్టి పిల్లవానికి ట్రీట్మెంటు ఏ దశలో ఎప్పటి నుంచి మొదలు పెట్టాలి అనేది కూడా నిర్ధారించే వీలున్నది. పిల్లవాని మెదడులో ట్యూమరులాంటిది, లేక మెదడుకు గాయాలు తగిలివున్నప్పుడు, మెదడులోని ఏ భాగంలో గడ్డగాని, గాయంగాని వున్నదో ఖచ్చితంగా గుర్తించవచ్చు. వల్ల, ఏదైన వ్యాధినిర్ధారణ జరిగి పిల్లవానికి తగిన చికిత్సని సకాలంలో అందించగలం. అలాగే మెదడుకు సంబంధించిన వ్యాధుల్లో సిటి స్కాన్ వంటి ఖరీదైన పరీక్షలు అవసరం వున్నదీ లేనిదీ కూడా ఈ పరికరం ద్వారా నిర్ధారించవచ్చు. ఈ పరికరం ద్వారా పిల్లలకి ఏ మాత్రం నొప్పి, అసౌకర్యం లేకుండా సున్నితంగా పరీక్ష జరుపవచ్చు. ఒకరకంగా చెప్పాలంటే చిన్న పిల్లల మూర్ఛవ్యాధి నిర్ధారణ చికిత్సలలో ఈ "న్యూరోపేజ్ 2300" పరికరం అత్యంత ఆవశ్యకత కలిగిన కీలకమైన అత్యాధునిక పరికరం అని పేర్కొనవచ్చు. పెద్ద నగరాలలోనే లభించే ఈ వైద్య సదుపాయాన్ని జిల్లాలోనే మొట్టమొదటిగా నెల్లూరు పొగతోటలోని రవి చిన్న పిల్లల ఆసుపత్రిలో ఏర్పాటు చేయడం జరిగింది. ఇది మన నెల్లూరీయులందరూ హర్షించతగ్గ పరిణామం.

# ఒబేసిటీ క్లినిక్‌కు రండి స్లిమ్‌గా తిరిగి పొండి

కోల ముఖం, కోటేరు లాంటి ముక్కు, నెలవంకను పోలిన నడుము, తమలపాకు తీగలా, తామరాకు కాడలా... అంటూ రక, రకాల వర్ణనలతో ప్రబంధ కావ్యాల్లో కవితల్లో నాయికలను వర్ణించారు. నిజ జీవితంలో కూడా తాము అందంగా, మంచి మనోహరంగా ఉండాలని ఆడవాళ్లు కోరుకోవడం సహజం. కానీ దురదృష్టవశాత్తు ఆహార అలవాట్లు శృతిమించో, ఇతరత్రా అనారోగ్య కారణాల వల్లనో రివటలా ఉండేవాళ్లు కూడా గుర్తుపట్టలేనంతగా లావెక్కి ఆపసోపాలు పడుతుంటారు. ఊబకాయం వికారమే కాదు, సర్వరోగాలకు నిలయమవుతుంది. ఇటువంటి వారి కోసం నెల్లూరులో డాక్టర్ పెంచలరెడ్డి ఒబేసిటీ క్లినిక్ - 2000 AD పేరుతో ఒక వైద్య సంస్థను ప్రారంభించారు. విజయా లాబరేటరీకి అనుబంధంగా ఏర్పడ్డ ఈ సంస్థ అనతి కాలంలోనే నెల్లూరులో విపరీతమైన పేరు గడించి మన్ననలను అందుకుంది. పెద్ద నగరాలకే పరిమితమైన ఒబేసిటీ క్లినిక్‌ను నెల్లూరు ప్రజలకు అందుబాటులోకి తెచ్చిన డాక్టర్ పెంచలరెడ్డి అభినందనీయుడు. ఊబకాయులకు వ్యాయామానికి ఉపకరించే ఆధునిక పరికరాలను లక్షలు వెచ్చించి ఏర్పాటు చేశారు. ఊబకాయానికి కారణాలు, దాని నివారణకు మార్గాలపై పెంచలరెడ్డి లోతుగా అధ్యయనం



డా॥ యం. పెంచలరెడ్డి
M.D.,D.C.P.,
రోగనిర్ధారణ శాస్త్రవేత్త మరియు ఊబకాయం నివారణ నిపుణులు
శ్రీమతి యం. అరుణ
డైటీషియన్

చేసినట్లున్నారు. ఈ విషయమై ఆయన సలహాలు, సూచనలు అందరూ ఆచరించదగినవి.

అధిక బరువును వైద్య పరిభాషలో 'ఒబిసిటీ' అని అంటారు. ఒబిసిటీ అంటే ఊబకాయం. మనిషి ఒంట్లో అధికంగా క్రొవ్వు నిల్వలు పేరుక పోవడం వల్ల సమాకారం పోయి ఊబకాయం వస్తుంది. ఈ ఊబకాయం అనేది ముఖ్యంగా తినడం ఎక్కువై - పని తక్కువైనందు వల్ల వస్తుంది. మరికొంత మందిలో హార్మోన్లలో అసమానతల వల్ల వస్తుంది.

ఊబకాయం అనేది ముఖ్యంగా బాగా డబ్బున్న వాళ్లకు వచ్చే జబ్బు ఇది. ఉన్నత వర్గాలకు చెందిన మహిళలు 50 శాతం ఊబకాయం గలవారే. అదే మగవాళ్లలో అయితే 33శాతం మందికి ఈ ఊబకాయం వున్నది. బీద ప్రజానీకానికి చెందిన మహిళలలో 4శాతం వుంటే, మగవాళ్లలో కేవలం ఒక్క శాతం ఉంది.

ఊబకాయం గలవారి పాట్ల ఒక రోగాల పుట్ట! ఊబకాయం గలవారు శారీరక మానసిక

తొరువ 8వ పేజీలో

# షుగర్ రోగులు దక్షిణభారతంలోనే ఎక్కువ

నెల్లూరులో చక్కెర వ్యాధి కోసం ప్రత్యేక క్లినిక్ నెలకొల్పిన మొదటి డాక్టర్ సత్యనారాయణమూర్తి. అప్పటి వరకు సాధారణ ఫిజీషియన్లే చక్కెర వ్యాధి సమస్యలకు చికిత్స చేయవల్సి వస్తుండేది. దాదాపు రెండు దశాబ్దాల నుంచి కొన్నివేల మంది మధుమేహ రోగులు సత్యనారాయణమూర్తి నుంచి వైద్య సలహాలు అందుకున్నారు. చక్కెర వ్యాధి ఖరీదైనదని పేరు; కాని సత్యనారాయణమూర్తి ఖరీదైన డాక్టర్ కాదు. పేద, మధ్యతరగతి రోగులు సైతం భరించగల్గిన మందులు, వైద్య పరీక్షలు సూచించడం సత్యనారాయణమూర్తి ప్రత్యేకత. మరోక ప్రక్క, అంతర్జాతీయంగా ఈ వ్యాధి నివారణకు సంబంధించి వచ్చే ప్రతి మార్పును ఎప్పటికి అప్పుడు గ్రహించి, సమాచారం తెప్పించి, దేశ విదేశాలలో జరిగే సదస్సులలో పాల్గొని, నిపుణుల అనుభవ సారం తాను తెలుసుకొని రోగులకు అందించడం ఆయన విశిష్టత. అందువల్లనే నెల్లూరు టౌన్‌లో ఎందరు డయాబెటీషియన్లు వచ్చినా సత్యనారాయణమూర్తి పేరు మాత్రం పెరగడం తప్ప తరగడం లేదు. ఇటీవల జరిగిన ఒక అంతర్జాతీయ సదస్సులో ఈ వ్యాధిపై జరిగిన చర్చల సారాంశం ఆయన మాటలలోనే చదవండి.

ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా ప్రకారం 2025 సంవత్సరానికి ప్రపంచంలో 30కోట్ల



డా॥ యస్. సత్య నారాయణమూర్తి
M.B.B.S., D.Diab (Yugoslavia)
చక్కెరవ్యాధి నిపుణులు

మంది మధుమేహ రోగులు వుంటే అందులో సగం మంది ఆసియా దేశాలలోనే వుంటారు. గత కొన్నేళ్లుగా ఆసియా దేశాలలో ఈ వ్యాధి విపరీతంగా పెరిగిపోయింది. అభివృద్ధి చెందిన దేశాలలో ఈ వ్యాధి 65ఏళ్ల వయస్సు మీరిన వృద్ధులకు మాత్రమే వస్తుంటే, ఆసియా దేశాలలో 45ఏళ్లు దాటిన వెంటనే వస్తున్నది. ప్రపంచానికంతటికీ భారతదేశంలోనే ఈ వ్యాధి సోకిన వారి సంఖ్య ఎక్కువగా వుండడం గమనార్హం. అందులోను దక్షిణ భారత దేశంలో దీని విస్తృతి ఎక్కువగా వుంది. ఆధునిక జీవన శైలిలో వస్తున్న మార్పులు, నగర జీవనంలో మానసిక ఒత్తిడి, శారీరక శ్రమ లేకపోవడం, వారసత్వంగా వ్యాధి సంక్రమించే వారిలో దక్షిణ భారతీయులు ఎక్కువగా వుండడం దీనికి కారణం.

గ్రామీణ ప్రాంతాలలోని వైద్యులకు చక్కెర వ్యాధి పట్ల, దాని చేదు ప్రభావాల పట్ల సరైన అవగాహన లేకపోవడంతో, దీని వ్యాప్తిని అరికట్టడం కష్టతరమౌతున్నది. ప్రభుత్వ ఆసుపత్రులలో దీనికి సరైన వసతులు లేవు; అన్ని సౌకర్యాలు కల్గిన ప్రైవేట్ క్లినిక్ సంఖ్య తక్కువ; దీని నివారణ ఖరీదుతో కూడుకున్నది కావడంతో ప్రైవేట్ క్లినిక్‌లకు అందరూ వాడుకోలేక పోతున్నారు. డయాబెటిస్ నివారణలో పాలకులు, విధాన రూపకర్తలు, డాక్టర్లు, మందుల కంపెనీలు, పరిశోధనా

తొరువ 8వ పేజీలో

# కోడూరుకు ఇరకాటం అభివృద్ధి సతమతం

వర్గ రాజకీయాలు ముదిరి పోవడంతో గూడూరు మునిసిపల్ పాలన స్తంభించి పోయింది. ఇటీవల ఎన్నికలలో గెల్చిన కౌన్సిలర్లు ఎవరికి వారే యమునాతీరే చందాన వ్యవహరిస్తున్నారు. ఇండిపెండెంట్ అభ్యర్థిగా

## గూడూరు కౌన్సిల్‌లో అయోమయం

నెగ్గి కోడూరు కల్పలత చరిత్ర సృష్టించినా, కౌన్సిల్‌లో మిగతా సభ్యులు సహకరించక పోవడంతో ఆమె ఏ అభివృద్ధి పని మీద దృష్టి కేంద్రీకరించ లేకపోతున్నారు. ఆమె కాంగ్రెస్ పార్టీలో చేరాలంటె అక్కడి ఆ పార్టీ నాయకుడు ఎల్లసిరి గోపాలరెడ్డి పడనీయడం లేదు. పోనీ తెలుగుదేశం పార్టీలో చేరాలనుకొంటే ఆ పార్టీ పట్టణాధ్యక్షుడు కిరణ్‌కుమార్ససేమిరా అంటున్నారు. పెద్ద సంఖ్యలో ఇండిపెండెంట్లు కౌన్సిలర్లుగా గెల్చి వున్నందున వారితో జత కట్టాలన్నా వాళ్లకు నాయకుడుగా వ్యవహరిస్తున్న నెల్లూరు రమణారెడ్డి వ్యతిరేకిస్తున్నారు. తను వైస్‌ఛైర్మన్ కాకుండా చేసిన కల్పలతను ప్రాణం పోయినా తమ కూటమి మద్దతు ఇవ్వరంటున్నారు. దీని వల్ల మునిసిపల్ సమావేశాల్లో ఛైర్మన్ ఏ అభివృద్ధి తీర్మానం ప్రవేశపెట్టినా ఆమోదించే వారులేకుండా పోయారు. మునిసిపాలిటీలో పనిచేసే సిబ్బంది సమయానికి జీతాలు ఇచ్చే ఏర్పాటు చేస్తానన్న హామీని నిలబెట్టుకోలేక పోవడంతోపాటు ఆమె మాటను పెద్దగా ఖాతరు చేయడం లేదు. ఈ స్థితిలో ఆమె మిగిలిన నాలుగున్నర ఏళ్లు పరిపాలన సాగించడం కష్టమేననాలి.

కోవూరులో జరిగిన జన్మభూమి సభలో మాట్లాడుతున్న జిల్లా మంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి. ప్రక్కన ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి.

# వవ్వేరులో నీటికి కట, కట

బుచ్చిరెడ్డిపాళెం మండలం వవ్వేరు గ్రామంలో గత రెండు నెలల నుంచి త్రాగునీటికి స్థానికులు పలు ఇబ్బందులు పడుతున్నారు. గత 20 సంవత్సరాల నుంచి మంచి నీటిని సరఫరా చేస్తున్న బావి ప్రస్తుతం ఎండి

## పట్టించుకొనే వారేరి?

పోవడంతో ఈ పరిస్థితి నెలకొంది. దీంతో స్థానికులు నీటి ఎద్దడిపై కలెక్టర్‌కు ఫిర్యాదు చేయగా రెండు లక్షలు మినీ వాటర్ స్కీమ్‌కి మంజూరు చేశారు. మరి ఆ స్కీమును ఎక్కడ ప్రారంభించాలనే విషయంలో వర్గ రాజకీయాలు తోడవ్వడంతో ఆ పనులు ఇంకా ప్రారంభం కాలేదని గ్రామస్తులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. కలెక్టర్ స్పందించి తమ గ్రామానికి వెంటనే మంచి నీటి సౌకర్యం కల్పించాలని గ్రామస్తులు కోరుతున్నారు.

## కళ్లున్న గుడ్డోళ్లు విద్యుత్ సిబ్బంది

బుచ్చిరెడ్డిపాళెం విద్యుత్ సబ్‌స్టేషన్ పక్కన ఒక రొయ్యలగుంట యజమాని యథేచ్ఛగా విద్యుత్ చౌర్యానికి పాల్పడుతున్నారు. విద్యుత్ సిబ్బంది పట్టించుకోలేదంటే వీరికి అసలు కళ్లున్నాయా, లేవా? ఆ కళ్లకు లంచం అనే పొరలు అడ్డుపడ్డాయా అన్న విమర్శలు వస్తున్నాయి. ఒక పక్క విద్యుత్ విజిలెన్స్ సిబ దాడులు జరుపుతున్నా, విద్యుత్ చౌర్యం జరుగుతుందంటే సిబ్బంది సహకారం లేదంటారా ఎ.డి.గారు? ముంబాయి రోడ్డు పక్కనే, ఒక ఆసామి తన రొయ్యల గుంటలను ఏర్పాటు చేశారు. విద్యుత్ కోసం నామ్‌కే వాస్తేగా బోర్డులు ఏర్పాటు చేసి పట్టపగలు అయిదు హెచ్‌పి మోటార్లకు దొంగ కరెంట్ వాడుకొంటున్నారు. కంచే చేను మేసినట్లు విద్యుత్ చౌర్యాన్ని అరికట్టాల్సిన అధికారులే వీటికి వత్తాసు పలికితే ఎట్లగయ్యా?

## రీకోలో రికార్డుల తనిఖీ

ఆత్మకూరు గ్రామీణ విద్యుత్ సహకార సంఘం (రీకో) కార్యాలయాన్ని జాయింట్ కలెక్టర్ కాడ్మియల్ 5తేదీ ఆకస్మికంగా తనిఖీ చేశారు. గతంలో ఇక్కడ మీటర్లు బిగించిన బాక్సుల్లో మతలబు జరిగిందని వచ్చిన ఆరోపణలు పరిశీలించేందుకు కార్యాలయంలో

## జిల్లావార్తలు

కొన్ని రికార్డులు పరిశీలించారు. అనంతరం గ్రామంలో ఈ బాక్సులు బిగించిన కొన్ని గృహాలను జెసి స్వయంగా సందర్శించి వీటి నాణ్యతను పరిశీలించారు. మీటర్లకు బాక్సులు బిగించడం మంచి చర్యే అయినా నాణ్యత గల బాక్సులు ఏర్పాటు చేయకపోవడం పట్ల జెసి అసంతృప్తిని వ్యక్తం చేసినట్లు తెలిసింది. ఈ అవకతవకల బాక్సుల ఏర్పాటుకు సూత్రధారియైన రీకో ఎండిని వెంట పెట్టుకొని

తరువ 10వ పేజీలో

# గ్రామసభలకు విద్యుత్ 'షాక్'

13వ విడత జన్మభూమి సభల్లో ఆఖరు రోజు బుచ్చిరెడ్డిపాళెంలో గందర గోళాలు చోటు చేసుకున్నాయి. ఈ సందర్భంగా సిపిఎం, డివైఎఫ్ఐ నాయకులు, కార్యకర్తలను దాదాపుగా 50 మందిని పోలీసులు అరెస్ట్ చేశారు. తొలుత గ్రామసభ ప్రారంభంకాగానే సిపిఎం నాయకులు గతంలో ఇచ్చిన అర్జీలు ఏమయ్యాయని సభను నిర్వహించను వచ్చిన అధికారులను నిలదీశారు. దీంతో కొంత సేపు గందరగోళం నెలకొంది. పెంచిన ఛార్జీలపై అధికారులు ఒక ప్రకటన చేయాలని కోరడంతో మరలా గలభా రేగింది. వెనువెంటనే పోలీసులు రంగ ప్రవేశం చేశారు. బుచ్చిరెడ్డిపాళెంలో 13వ విడత జన్మభూమి కార్యక్రమాలలో ఒకటి, అర మినహా మిగతా గ్రామాలలో, గ్రామసభలకు అంతరాయం కలిగింది. దామరమడుగులో ఏకంగా పెంచిన విద్యుత్ ఛార్జీలను తాము కట్టేది లేదని గ్రామ కమిటీ తీర్మానం చేసింది. ఆమేరకు వారి తీర్మానం కాపీలు ముంబాయి రోడ్డుమీద పెట్టడం మరీ విశేషం. బిల్లులు వసూలు చేసేందుకు వచ్చిన బిల్ కలెక్టరును గ్రామస్తులు తిప్పి పంపారు. అలాగే మినగల్లు, పెనుబల్లి,

## బుచ్చి, ఆత్మకూరు గ్రామసభల్లో గందరగోళం

జొన్నవాడ, కాగులపాడు తదితర గ్రామాలలో పెంచిన విద్యుత్ ఛార్జీలు కట్టవద్దని సిపిఎం, డివైఎఫ్ఐ నాయకులు ప్రచారం చేస్తున్నారు. క్రమం తప్పకుండా మినగల్లు, ఎంబేడు, పెనుబల్లి గ్రామసభలలో పాల్గొనే కోవూరు ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి ఈసారి వాటికి డుమ్మాకొట్టి గుట్టుచప్పుడు కాకుండా చెల్లాయపాళెం గ్రామసభలో పాల్గొని వెళ్లడం జరిగింది. కోవూరు నియోజక వర్గంలో ప్రజాదరణ కలిగిన ఎమ్మెల్యే ప్రసన్న కుమార్‌రెడ్డేకరెంట్ ఛార్జీల విషయంలో తప్పించుక తిరుగుతున్నాడంటే ఇక మిగతా నాయకుల పరిస్థితి చెప్పనక్కరలేదు.

## హామీపత్రం రాసి గ్రామసభ

ఆత్మకూరు నియోజకవర్గ పరిధిలోని ప్రధాన పంచాయతీల్లో అధికారులు, మహిళా జన్మభూమి సందర్భంగా గ్రామసభలు నిర్వహించలేక పోయారు. 6తేది ధైర్యం చేసి ఆత్మకూరు జూనియర్ కాలేజీలో గ్రామసభను నిర్వహించను వచ్చిన అధికారులను సిపిఎం,

తరువ 10వ పేజీలో

# నెల్లూరు గుసగుసలు

## విశ్లేషకుడు

### విద్యుత్ బిల్లులతో గుండెలు గుబేల్

పెంచిన విద్యుత్ ఛార్జీలకు అనుగుణంగా వచ్చిన బిల్లులు చూసి విని యోగదారుల గుండెలు గుబేల్ మన్నాయి. జూన్ నెలలో విద్యుత్ ఛార్జీలను పెంచాక, జూలై నెలలో నెలసరి మొదటి బిల్లులిస్తామన్న వాగ్దానాన్ని ఆ శాఖాధికారులు నిలబెట్టుకోలేక పోయారు. ఎప్పటి మాదిరగానే జూన్, జూలై నెలలకు కలిపి ఆగస్టు మొదటి వారంలో బిల్లులిచ్చారు. ఎక్కువ శాతం మంది వినియోగదారులకు గతంలో తాము చెల్లించే దానికన్నా రెట్టింపు మొత్తంలో బిల్లులు రావడంతో హడలిపోయారు. దీనికితోడు ఈ బిల్లులోనే సెప్టెంబర్ 14తేదీలోగా ప్రస్తుతం వచ్చిన బిల్లులో సగం మొత్తం మళ్లీ కట్టాలని హుకుం జారీ చేశారు. తాము ఎప్పటిలానే మళ్లీ రెండు నెలలకు కలిపి అక్టోబర్‌లో బిల్లులివ్వను విద్యుత్ శాఖాధికారులు ఈ ఎత్తుగడ వేసినట్లుంది.

### విద్యుత్ బిల్లులు చెల్లించడం లేదు

విద్యుత్ ఛార్జీలు చెల్లించే గడువు 14తేది దగ్గరపడినా నెల్లూరుటౌన్‌లో బిల్లుల చెల్లింపు పాతిక శాతం కూడా లేదు. బిల్లుల వసూలు కేంద్రాలైన విద్యుత్‌భవన్, కోటమిట్ట, పాతపెద్దాస్పత్రి, బైపాసురోడ్డులోని సబ్‌స్టేషన్, మూలపేటల్లో సిపిఎం పార్టీ కార్యకర్తలు షామియానాలు వేసుకొని కూర్చొన్నారు. బిల్లులు కట్టను వచ్చిన వారికి సమిష్టిగా వుంటేనే విజయం సాధిస్తామని చెబుతుండే సరికి తిరిగివెళ్లి పోతున్నారు.

### వేణుంబాక వీరరాఘవరెడ్డి మరణం

ముత్తుకూరు మండలం తాళ్లపూడి గ్రామానికి చెందిన స్వాతంత్ర్య సమర యోధుడు వేణుంబాక వీరరాఘవరెడ్డి 8తేది హైదరాబాద్‌లో మరణించారు. అంత్యక్రియలు 9తేది స్వగ్రామంలో జరిగాయి. నెల్లూరు కన్యకల ఆస్పత్రి,



టిబి ఆస్పత్రి, మద్రాస్ క్యాన్సర్ ఆసుపత్రి, వీరారెడ్డి సత్రాల అభివృద్ధికి ఆర్థిక సహాయమందించిన వితరణశీలి. వీరరాఘవరెడ్డికి భార్య, ఇద్దరు కుమారులు, నలుగురు కుమార్తెలున్నారు. ఐజిపి దినేష్‌రెడ్డి, ప్రముఖ కాంట్రాక్టర్ సురేష్‌రెడ్డి ఈయన కుమారులే. జిల్లా ప్రముఖ రాజకీయ కుటుంబాలైన ఆనం - గునపాటి కుటుంబాలలో వీరరాఘవ రెడ్డి వియ్యమొందారు.

వీరి కుటుంబానికి మా సానుభూతి.

## డా. వెంకటరమణారెడ్డి

9వ పేజీ కొరవ

సైనసిటిస్ కలుగచేస్తాయి.

* ప్రమాదాలు: కొన్ని ప్రమాదాలలో మాక్సిలరీ ఎముక విరిగిపోయి సైనసిటిస్ వస్తుంది.

దంత సంబంధిత సమస్య: దంతాలకు సంబంధించిన కొన్ని వ్యాధులలో చీము సైనస్‌లో చేసి సైనసిటిస్ వాస్తుంది. పన్ను తీసి వేసేటప్పుడు కొన్నిసార్లు విరిగిపోయి సైనస్‌కు రంధ్రం పడే అవకాశం వుంది.

సైనసిటిస్ లక్షణాలలో ముక్కు నుంచి నీరు కారడం, విపరీతంగా తుమ్ములు రావడం ప్రధానమైనవి. ఈ సమస్య వచ్చినప్పుడు ముక్కులు మూసుకొనిపోతాయి. సైనసిటిస్‌కు తొలిదశలోనే చికిత్స చేయించకుంటే పూర్తిగా తగ్గుతుంది. లేకుంటే క్రానిక్‌గా మారి సతాయిస్తుంది. క్రానిక్ సైనసిటిస్ వచ్చిన వారికి ముక్కుల నుండి చీము కారడం, ముక్కులు మూసుకొని పోవడం, చెడువాసన రావడం. విపరీతమైన తలనొప్పి రావడం జరుగుతుంది. ఈ పరిస్థితులలో ఆపరేషన్ చేయడం తప్ప మార్గం లేదు. సైనస్ చికిత్సకు చాలా రకాల మార్గాలు వున్నాయి. అందులో యంట్రాల్ వాష్ ఒకటి. సైనస్‌లోకి చిన్న గొట్టం పంపించి స్పీడుగా నీరు పంపు చేయడం ద్వారా చీము మొత్తం కడిగి వేయడం జరుగుతుంది. కాని ఈ పద్ధతిలో తాత్కాలిక సైనస్ సమస్యలు తప్ప క్రానిక్ జబ్బులు నయం చేయలేం.

ఇంట్రా నాసల్ యాంట్రోస్టోమి అనేది ఒక చిన్న ఆపరేషన్. ముక్కు నుండి సైనస్‌లోకి పెద్ద రంధ్రం చేయడం ద్వారా చీము తొలగిస్తున్నారు. ఎండోస్కోపి సర్జరీ అనేది నూతన ప్రక్రియ. ఇందుకు వాడే సైనస్ ఎండోస్కోప్ చాలా ఖరీదైన పరికరం. ముక్కు సైనస్‌కు వుండే రంధ్రం సరిచేసి, దాని చుట్టుప్రక్కల గల అడ్డంకులు తొలగించి, సైనసిటిస్ పూర్తిగా నయం చేయగల ప్రక్రియ ఇది.

## డా.సత్యనారాయణ మూర్తి

6వ పేజీ కొరవ

సంస్థలు, రోగుల మధ్య సంయమనం లేదు.

ఈ నేపథ్యంలో ఈ రోగ నివారణకు తీసుకోవల్సిన చర్యల గురించి ఆస్ట్రేలియాలో జరిగిన అంతర్జాతీయ సదస్సు కొన్ని లక్ష్యాలు నిర్దేశించింది. మధుమేహం వల్ల వచ్చే గుండె పోటు ప్రమాదం, కంటి రెటీనా జబ్బుల సమస్యలను కనీసం 25శాతం మేర తగ్గించాలని; చక్కెర వ్యాధి వల్ల వచ్చే అంధత్వం, కాళ్లు వంటి అంగాలు తొలగించవల్సిన పరిస్థితులను 50శాతం మేర నివారించాలని; తల్లి గర్భంలో చక్కెర వ్యాధి సోకే ప్రమాదాన్ని పూర్తిగా రూపుమాపాలని ఈ సదస్సు లక్ష్యంగా పెట్టుకుంది.

చక్కెర వ్యాధి కల్గిన రోగాలలో హైపర్ టెన్షన్ సమస్య ఎక్కువగా వుండడం వల్ల గుండె పోటు ప్రమాదం పెరిగిపోతున్నదని సదస్సు గుర్తించింది.

## డా. పెంచలరెడ్డి

6వ పేజీ కొరవ

మరియు సామాజిక సమస్యలతో బాధపడాల్సి వస్తుంది. అన్ని వ్యాధులకు మూలం ఈ ఊబకాయం. దీనివల్ల షుగర్, బిపి, కొలస్ట్రాల్, గుండెజబ్బులు, స్ట్రోక్, కీళ్ల నొప్పులు, గాల్‌స్టోన్స్, కిడ్నీ వ్యాధులు, క్యాన్సర్లు, డిప్రెషన్, ఆత్మనూన్యతా భావం, శ్రద్ధ లేకపోవడం లాంటి లక్షణాలతో బాధపడుతుంటారు.

ఊబకాయం తగ్గాలంటే తక్కువ తిని, ఎక్కువ పని చెయ్యాలి. కాని కొంత మంది మందులతో బరువును తగ్గిస్తాం. మరి కొంత మంది కరెంటు పెట్టి ఒంట్లోని క్రొవ్వుని కరిగిస్తాం అని ప్రకటనలు ఇస్తుంటారు. వాటిల్లో ఏ మాత్రం నిజం లేదు. వాటివల్ల మనకు కలిగే సత్ఫలితాలకన్నా దుష్ఫలితాలే ఎక్కువ.

ఒబేసిటీ క్లినిక్‌లో మొదట అధునాతన పద్ధతుల ద్వారాఊబకాయం ఎందుకొచ్చిందో రోగ నిర్ధారణ గావించి, శాస్త్రీయ పద్ధతులు డైట్ థెరపి, ఎక్సర్‌సైజ్ థెరపి, యోగ థెరపి, క్రోమోథెరపి, మాగ్నటో థెరపి, ఆక్యుప్రెషర్ చికిత్సలు చేస్తారు.

వైద్య రంగంలో 25 సంవత్సరాల పైబడి అనుభవం గడించిన డాక్టర్ పెంచలరెడ్డి ఒబేసిటీ క్లినిక్ అత్యాధునికమైన స్లిమ్మింగ్ యంత్ర పరికరాలతోబాటు పూర్తిస్థాయి జిమ్ సౌకర్యం కల్గిన హెల్త్ క్లబ్, హెల్త్ మ్యూజియం, హెల్త్ అండ్ జనరల్ లైబ్రరీ వసతులు కల్గిన ప్రైవేట ఒబేసిటీ క్లినిక్ స్త్రీలకు సాటికి సూరుపాళ్ల ప్రైవసీ మరియు భద్రత కల్గిన ఒబేసిటీ క్లినిక్ స్త్రీలకు స్త్రీల ద్వారానే శిక్షణ ఇస్తారు. అంతర్జాతీయ ప్రమాణాలకు ఏ మాత్రం తీసిపోకుండా అన్ని హంగులతో ఏర్పాటు చేశారు.







## సంస్మరణ

మా అభివృద్ధికి కారకులు, మా తండ్రి

### గున్నంరెడ్డి సుందరరామిరెడ్డి గారు

పరమపదించి 17.8.2000 తేదికి పదకొండు సంవత్సరాలు పూర్తవుతాయి.
పదకొండవ వర్థంతి సందర్భంగా వారికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

డాక్టర్ జి. కొండారెడ్డి, డెంటల్ సర్జన్, నెల్లూరు
జి. రఘురామిరెడ్డి

# వాతావరణమే జలుబుకు కారణం!

ముక్కు అనేది వుంటే జలుబు కూడా వెంటనే వస్తుంది. జలుబుకి మందు వాడితే వారం రోజులలో తగ్గుతుంది; వాడకపోతే ఏడు రోజులలో తగ్గుతుంది అనేది సామెత. కాని పాత సామెత. పరిస్థితి మారిపోయింది. అప్పట్లో జలుబుకు కారణం కేవలం వైరస్; ఇప్పుడు వాతావరణ కాలుష్యం ప్రధానం కారణం. దీన్ని మనం అలెర్జీ అంటుంటాం. ముక్కు అలెర్జీ వున్న వారిలో సైనసిటిస్, ముక్కులో కండలు పెరగడం, ముక్కులో పాలిప్స్ పెరగడం సాధారణం. వాతావరణ కాలుష్యం పెరిగే కొద్దీ సైనస్ సమస్యలూ పెరిగి పోతున్నాయి.

**డా॥ ఎ.వెంకట రమణారెడ్డి**
M.S. (ENT), FCGP.,
ENT స్పెషలిస్టు

ముక్కుకు రెండు ప్రక్కలా వెనుక భాగంలో వుండే గాలి గదులను సైనస్ అంటారు. ఇవి మూడు రకాలు. మాక్సిలరీ సైనస్, ఫ్రంటల్ సైనస్, ఎత్మోయిడల్ సైనస్.

సైనస్ వల్ల కొన్ని మేళ్లు వున్నాయి. వీటి వల్ల తలలో వుండే ఎముకల బరువు తగ్గించడం; గాలి పీల్చేటప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసల ఉష్ణోగ్రత క్రమబద్ధీకరించడం జరుగుతుంది. మూడు రకాల సైనస్‌లు మ్యుకస్ అనబడే పలుచటి పొరతో కప్పబడి వుంటాయి. ఈ మ్యుకస్ నుంచి కొన్ని రకాల ద్రావకాలు విడుదల అవుతాయి. సైనస్‌లో చిన్న చిన్న రంధ్రాల ద్వారా ముక్కులోకి కలుపబడి వుంటాయి. ఈ ద్రావకాలు ఆ రంధ్రాల ద్వారా ముక్కులోకి ప్రవేశించి, ముక్కును తడిగా వుంచుతుంటాయి. సైనస్‌లో వుండే కొన్ని రకాల వెంట్రుకల కదలికల వల్ల ఈ ద్రావకాలు ముక్కు నుంచి బయటకు నెట్టివేయ బడతాయి. ఏదైనా కారణం చేత ఈ సాధారణ ప్రక్రియకు ఆటంకం కల్గితే అది సైనసిటిస్‌గా మారుతుంది.

## సైనసైటిస్‌కు కారణాలు:

సైనసిటిస్: ఇది అతి సాధారణంగా వైరస్‌ల వల్ల వచ్చే జలుబు. దానికదే తగ్గి పోతుంది. కొన్ని రకాలైన వైరస్ వ్యాధులలో ఇది సైనస్‌లకు కూడా వ్యాపించి రైనోసైనసిటిస్‌గా మారుతుంది. ఈ సమయంలో సరైన చికిత్స తీసుకుంటే తగ్గిపోతుంది; అదే క్రానిక్‌గా మారితే మాత్రం ఆపరేషన్ చేయాల్సి వస్తుంది.

అలెర్జీ: వాతావరణ కాలుష్యం వల్ల వచ్చే వ్యాధి అలెర్జిక్ రైనైటిస్. ఇది వున్న వారికి ధారాపాతంగా ముక్కు నుంచి నీళ్లు కారుతాయి. విపరీతంగా తుమ్ములు వస్తాయి. ముక్కులో కండలు (అడినాయిడ్స్) పెరిగి గాలి సరిగా తీసుకోలేక, సైనస్ ద్వారాలు మూసుకొని పోతాయి.

ముక్కు గదుల మూసివేత: కొన్ని రకాలైన గడ్డలు, ముక్కులో పెట్టుకొని కొన్ని వస్తువులు ముక్కు రంధ్రాలు మూసివేసి

తరువాయి 8వ పేజీలో

## కెనరా బ్యాంక్, నెల్లూరు

శ్రీమతి వి. భారతి సాగర్, బాలాజీనగర్, నెల్లూరు వారు మా బ్యాంక్ నుండి లాకరు నంబరు 68 సౌకర్యము పొంది వున్నారు. ఎన్నియో నోటీసులు పంపినను వారు అద్దె బకాయిలు కట్టనందున వారికి రిజిష్టరు నోటీసు జారీ చేసి సదరు లాకరు 30.5.2000 తేదిన సాక్షుల సమక్షములో Break Open చేయగా సదరు లాకరు నందు ఈ క్రింద తెలియపరచిన బంగారు ఆభరణము వున్నది.

**ముక్కుపుడక తూకము**
**గ్రాములలో : 0.3 గ్రా.**

Break Open చేసిన తదుపరి కూడా రిజిష్టరు నోటీసు పంపినను బంగారు ఆభరణము బకాయి కట్టి విడిపించుకొనలేదు. అందువలన పైన తెలిపిన ఆభరణము 24.8.2000 తేది మధ్యాహ్నం 3 గంటలకు బ్యాంకు ఆవరణములో వేలము వేయబడునని తెలియ జేయడ మైనది.

సదరు వేలము నిలిపి వేయుటకు కాని, మార్చుటకు కాని బ్యాంకు వారికి సర్వాధికారములు కలవని తెలియజేయడమైనది.

ఆసక్తి కలవారు వేలములో పాల్గొన వలసినదిగా కోరడమైనది.

సీనియరు మేనేజరు
కెనరాబ్యాంకు, నెల్లూరు

## డా. శ్రీధర్

5వ పేజీ తరువాయి

మందును సంగ్రహిస్తారు.

మెదడు వాపుకు శాస్త్రీయమైన నివారణ మార్గం మెదడువాపు టీకా మాత్రమే. ఈ విషయమై నెల్లూరులోని సిమ్స్ ఆస్పత్రి వైద్య బృందం మెదడు వాపు టీకా మందు ఆవశ్యకతపై నెల్లూరు, హైదరాబాద్ లాంటి పట్టణాలలో అవగాహనా శిబిరాలు ఏర్పాటు చేసింది.

మెదడు వాపు టీకా వ్యాధి విజృంభణ దశలో సిఫార్సు చేయరు. వ్యాధి తీవ్రతరం కాకముందే దీనిని వేయించాలి. ఏ టీకానైనా శరీరంలో వ్యాధి నిరోధక శక్తిని పెంపొందించ డానికి కొంత వ్యవధి అవసరం. వ్యాధి విజృంభణ దశలో టీకా వేయించినప్పటికీ వ్యాధిని ఎదుర్కొనే రోగనిరోధక శక్తి శరీరంలో ఉత్పన్నం కాదు. అందుచేతనే సిమ్స్ ఈ ఏడాది మార్చి నెలాఖరులో "విస్తృత టీకాల కార్యక్రమాన్ని" ప్రారంభించింది.

అనేక కారణాల వలన పిల్లలు మూడు డోసులు పూర్తిగా వేయించుకోవడం లేదు. మూడు డోసులు తప్పనిసరిగా వేయించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

## డా. అనిల్

5వ పేజీ తరువాయి

పట్టణాల్లోని చాలా హాస్పిటల్స్ ఈ రోగనిర్ధారణ నిపుణులను బయోకెమిస్టులగా నియమించి వారి ఆధ్వర్యంలో పరీక్షలు జరిపించడం, వారి చేతనే ఆ పరీక్షల రిపోర్టులు నిర్థారించడం వంటివి చేపట్టి ఈ చక్కెర వ్యాధి నిర్థారణలో మార్పులు తెచ్చారు. అలాగే అధునాతనమైన ఆటో అనలైజర్ ద్వారా పరీక్షలు జరిపినట్లయితే లోపాలు జరుగకుండా నివారించవచ్చు.

ఏది ఏమైనప్పటికి డయాబెటిస్ వున్న వ్యక్తి ముఖ్యంగా గమనించవలసిన దేమిటంటే తమ వ్యాధికి డాక్టరు ఎంత ముఖ్యమో తమ రక్తపరీక్షలు జరిపించే డాక్టరు నిపుణులు అంతకన్నా ముఖ్యం. అందువల్ల వారు క్రమం తప్పకుండా రక్తంలోని చక్కెర శాతాన్ని శ్రద్ధగా పరీక్షించుకొంటూ ఎప్పటికప్పుడు తమ మాత్రలు లేదా వారు వాడే ఇన్సులిన్ సూదుల మోతాదును కొత్తగా తెలుసుకున్నప్పుడే వారు చక్కెర వ్యాధిని పూర్తిగా జయించగలరు.

ఉదయాన్నే ఖాళీ కడుపున 70-100 మి.గ్రా లోపు, ఆహారం తిన్న 1 1/2 గంట తర్వాత 100-160 మి.గ్రాల లోపు, సాయంత్రం పూట 70-120 మి.గ్రా.లు దాటకుండా రక్తంలోని చక్కెర శాతాన్ని అదుపులో వుంచుకోవాలి. అలాగే మానవ శరీరంలో ఉదయం పూట రక్తంలో చక్కెర శాతం హెచ్చుగా వుంటుంది. అందువలన సాయంత్రం పూట పరీక్షలు పెద్దగా ఉపయోగపడవు. రక్తంలోని చక్కెర 160 మిల్లీ గ్రాములు దాటితే రక్తం చిక్కగానూ మరియు జిగురుగాను మారి మన శరీరంలోని రక్తనాళాలను పూడ్చివేస్తుంది. దీనివల్ల గుండె, కిడ్నీలు, కళ్లు, మెదడు, కాళ్లు మొదలైన అవయవాలకు రక్తప్రసారం తగ్గి కాలక్రమేణా వాటి సామర్థ్యం తగ్గి అవి పనిచేయడం మానివేస్తాయి.

## డా. కృష్ణారెడ్డి

11వ పేజీ తరువాయి

దెబ్బ తినే ప్రమాదం వుంది. క్యాన్సర్ వల్ల కూడా ఇది రావచ్చు. ప్రారంభం దశలోనే గుర్తిస్తే సులభంగా న్యాయం చేయవచ్చు.

రక్తం పడటం: మూత్రం పసుపు లేదా ఎరుపు రంగులోకి మారుతుంటే, శరీరంలో ఆరోగ్య లోపాలు ఏర్పడుతున్నాయని తెలుసుకోవచ్చు. నడుం పైభాగం నుండి, పొత్తి కడుపు మీదుగా మూత్ర ద్వారం వరకు నొప్పి కల్గితే అది మూత్ర పిండాలలో కల్గిన సమస్యగా భావించాలి. నొప్పి లేకుండా రక్తం పడితే, కిడ్నీ సమస్య, రెనలసిస్ట్, హైడ్రోనెఫ్రోసిస్ వంటి వ్యాధులు వుండే అవకాశం వుంది. అసలు నొప్పి లేకుండా మూత్రం ద్వారా ఎక్కువ రక్తం పోతుంటే, మూత్ర కోశంలో క్యాన్సర్, క్షయ వంటి జబ్బులు ఏర్పడినట్లు అనుమానించి డాక్టర్‌కు తక్షణం చూపించాలి.

సంతానలేమి: సంతాన లోపానికి చాలా సార్లు పురుష లోపం ప్రధానం కావడం అవుతుంది. ఎండోక్రైన్ లోపాల వల్ల పిల్లలు పుట్టకుండా పోయే ప్రమాదం వుంది. వరికోసిల్ వున్న పురుషులలో శరీర ఉష్ణోగ్రత సాధారణంగా కంటే రెండు డిగ్రీలు తక్కువగా వుంటుంది. బీజ అణువుల ఉత్పత్తికి ఉష్ణోగ్రత అవసరం. వరికోసిల్ ఆపరేషన్‌తో వేడి పెంచి పిల్లలు పుట్టే అవకాశం కల్పించ వచ్చు.

## గ్లోబల్ హాస్పిటల్

11వ పేజీ తరువాయి

ఆ తరహా వైద్యం అందుబాటులోకి తెస్తే కేవలం 5 నుంచి 7లక్షల రూపాయల లోపు సరిపోతుం దట. సగటు మనిషి సైతం దాని వల్ల ప్రయోజనం పొందుతాడన్నది ఆయన ఆశ. లివర్, పాంక్రియాసిస్‌లు తప్ప తతిమా గాస్ట్రో సంబంధిత ఆపరేషన్లు అన్నీ చేయడానికి గ్లోబల్ హాస్పిటల్‌లో సౌకర్యాలు వున్నాయి. తన హాస్పిటల్ నడుపుకోవడంతో పాటు, దాదాపు 300 మంది డాక్టర్లకు లాప్రొస్కోపి సర్జరీలో శిక్షణ ఇచ్చారు రవీంద్రనాథ్ ప్రభుత్వ స్థాయిలో జరగవల్సిన వైద్య శాస్త్ర అభివృద్ధి, ఒక్క వ్యక్తి పరంగా జరపడం చాలా కష్టం. కాని రవీంద్రనాథ్ లోని దృఢ సంకల్పం, ఆశయ నిబద్ధత అటువంటి కష్టాలను లెక్క చేయకుండా ముందుకు సాగేందుకు ఉపకరిస్తున్నది.

గ్లోబల్ హాస్పిటల్‌కు ఇప్పుడు దేశమంతటి నుంచి రోగులు వస్తున్నారు. కొన్ని ఇతర దేశాల నుంచి సైతం రోగులు రావడం విశేషం. ఇప్పటి వరకు డబ్బుకల్గిన భారతీయులు వైద్యం కోసం విదేశాలకు వెళ్లడం అలవాటు; ఇప్పుడు విదేశాల నుంచి ఇక్కడకు రోగులు వచ్చే పరిస్థితి కల్పించారంటే, గ్లోబల్ హాస్పిటల్ లోని వైద్య వసతులు ఎంత అధునికమైనవో వూహించుకోవచ్చు.

రవీంద్రనాథ్ సోదరుడు డాక్టర్ రమేష్ కూడా నిపుణుడైన వైద్యుడు. ఆయన ప్రత్యేకత చిన్న పిల్లలకు వచ్చే గాస్ట్రోఎంట్రాలజీ చికిత్స. రమేష్ తన మిత్రులతో కల్సి స్థాపించిన రైన్‌బో హాస్పిటల్ కూడా బంజారా హిల్స్ లోనే వుంది. చిన్న పిల్లల వైద్యానికి సంబంధించి అన్ని ఆధునిక వసతులు కల్గిన ఆస్పత్రి దేశంలో మరొకటి లేదనడం అతిశయోక్తి కాదు. రమేష్ కూడా గ్లోబల్ ఆసుపత్రిలో అందుబాటులో వుంటారు.

ఒకే కుటుంబంలో ఇద్దరు వ్యక్తులు వైద్య రంగంలో ఇంత గొప్ప పేరు తెచ్చుకోవడం, ప్రతిభా ప్రావీణ్యతలు సాధించడం అబ్బురం కల్గించే విషయం. వారిని కన్న తల్లిదండ్రులు ఎంత అదృష్టవంతులో!

## డాక్టర్ ఆండాళ్

12వ పేజీ తరువాయి

చేస్తారు. ఆడవారికి అన్ని పరీక్షలు అయిపోయిన తర్వాత మగవారికి వీర్యం పరీక్ష చేసినప్పుడు లోపం ఉంటే చాలా టైము పడుతుంది. అనవసరంగా ఆడవారిని సబ్జక్టు చేసినట్లవుతుంది. అందుకని ముందుగా మగవారికి పరీక్ష చేయాలి. మగవారిలో లోపం లేదని నిర్థారించిన తర్వాత ఆడవారికి ఈ క్రింది పరీక్షలు చేస్తారు.

ఫాలిక్యులార్ స్టడీ: అండాశయం సరిగా పనిచేసి అండం విడుదల సరిగా జరుగుతుందా, లేదా అని చేసే స్కానింగ్.

హెచ్.ఎస్.జి: ట్యూబులు నార్మల్‌గా వున్నాయా లేక ఏమన్నా అడ్డాలున్నాయా అని తెలుసుకోవడానికి చేసే పరీక్ష.

పి.సి.టి: భార్యాభర్తల కలయిక తర్వాత వీర్యకణాలు గర్భసంచిలోకి సరిగా ప్రవేశిస్తున్నాయా లేదా అని తెలుసుకోవటానికి చేసే తెల్లమైల పరీక్ష.

హార్మోన్ అనాలిసిస్: మెదడు నుంచి విడుదల అయ్యే హార్మోన్లలో ఏమన్నా మార్పు ఉన్నదా అని తెలుసుకోవడానికి చేసే రక్త పరీక్ష.

లాపరోస్కోపి: గర్భాశయం, అండాశయం, ట్యూబ్స్ ఎలా ఉన్నాయి అని చేసే కీహోల్ సర్జరీ.

హిస్టెరో స్కోపి: గర్భాశయం లోపలి వైపు ఎలా ఉందో చూసేదానికి చేసే ఒకరకమైన ఎండోస్కోపి.

గర్భం అనేది ఎప్పుడైనా రావచ్చు. పరీక్షలు చేసేటప్పుడే రావచ్చు. లోపం కనుక్కొని ట్రీట్మెంట్ తీసుకునే సమయంలో కూడా రావచ్చు. కొంత మందికి ట్రీట్మెంట్ ఆపిన తర్వాత కూడా రావచ్చు.

ట్రీట్మెంట్ వల్ల మంచి ఫలితాలు పొందాలంటే మొట్టమొదట టెస్ట్‌లు మరియు ట్రీట్మెంట్ గురించి అవగాహన చేసుకోవాలి. ట్రీట్మెంట్ టైము తీసుకుంటుంది. కాబట్టి ఓపికగా, పట్టుదలగా రావాలి.

# జిల్లావార్తలు

7వ పేజీ తరువాయి

జాయింట్ కలెక్టర్ బాక్సుల పరిశీలనకు వెళ్లడం విమర్శలకు దారితీసింది.

## విద్యుత్ చౌర్యానికి కఠిన శిక్ష

బుచ్చిరెడ్డిపాళెం మండలంలో రొయ్యలసాగు చేసే రైతులు విద్యుత్ చౌర్యానికి పాల్పడితే కఠినంగా శిక్షిస్తామని ట్రాన్స్‌కో విజిలెన్స్ సిఐ మధుసూధనరావు చెప్పారు. ఆయన బుచ్చిరెడ్డిపాళెంలో సోమవారం జరిగిన ఆక్వా రైతుల సమావేశంలో పాల్గొని ప్రసంగించారు. ఆక్వా రైతులు హైటెన్షన్ విద్యుత్ కనెక్షన్‌కు రెండు వేలు చొప్పున చెల్లించి దీన్ని పొందవచ్చని చెప్పారు. రాష్ట్ర వ్యాప్తంగా వ్యవసాయ రంగానికి తొమ్మిది గంటలు విద్యుత్ సరఫరా చేయాల్సి ఉందని చెప్పారు. సింగిల్ ఫేస్ విద్యుత్ వచ్చేటప్పుడు కెపాసిటర్‌లు పెట్టి మోటార్లు వేయడం కూడా నేరంగా పరిగణిస్తామని, రైతులు దీన్ని అర్థం చేసుకోవాలని కోరారు. ఆక్వా సాగును పరిశ్రమక్రింద పరిగణించి 24 గంటలు విద్యుత్ సరఫరా అయ్యేలా చూడాలని రైతులు, అధికారులను కోరారు. కార్యక్రమంలో బుచ్చి సబ్ డివిజనల్ ఎ.డి. రమణయ్య, బుచ్చి, సంగం, దామరమడుగు ఎఇలు జనార్థన్, విజయ్‌బాబు, ధనుంజయ, విద్యుత్ సిబ్బంది పాల్గొన్నారు.

## ఎఎన్ఎంపై ఆరోపణలు వాస్తవమే

బుచ్చిరెడ్డిపాళెం మండలం చెల్లాయపాళెం గ్రామంలో పనిచేస్తున్న ఎఎన్ఎంపై వచ్చిన ఆరోపణలు వాస్తవమేనని విచారణాధికారి డాక్టరు దశరథరామయ్య తెలిపారు. చెల్లాయపాళెం ఎఎన్ఎం విక్టోరియా రాణి సరిగ్గా తన విధులకు హాజరు కావడం లేదని స్థానిక ప్రజలు, ఉన్నతాధికార్లకు ఫిర్యాదు చేశారు. దీంతో వైద్యశాఖ ఉన్నతాధికారులు ప్రజల ఆరోపణలను విచారించేందుకు విచారణాధికారిని నియమించారు. డాక్టరు దశరథరామయ్య ప్రజల నుంచి వచ్చిన ఫిర్యాదులను బహిరంగంగా విచారించగా అవి అన్నీ వాస్తవమేనని తెలిసింది. ఆమెపై స్థానికంగా ఉండే ప్రజలు, దళితవాడలో సైతం ఈ ఎఎన్ఎం మాకు అవసరం లేదని చెప్పడం జరిగింది. గతంలో జరిగిన 12వ విడత జన్మభూమిలో ఆమె ప్రవర్తనపై ఫిర్యాదులు రావడంతో అప్పట్లో జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి మందలించడం జరిగింది. అయినప్పటికీ ఆమెలో మార్పు రాకపోవడం గమనార్హం. ఆమెను బదలీ చేయనున్నట్లు వైద్యశాఖాధికారులు చెప్పారు.



## వవ్వేరులో 50 పుట్ల ధాన్యం స్వాధీనం

బుచ్చిరెడ్డిపాళెం మండలం వవ్వేరు గ్రామంలో అక్రమంగా నిల్వ వుంచిన 50 పుట్ల ధాన్యాన్ని విజిలెన్స్ సిఐ విల్సన్ స్వాధీనం చేసుకొన్నారు. ఈ సందర్భంగా అల్లం శీనయ్య అనే వ్యక్తిని అరెస్ట్ చేసి కోర్టుకు హాజరు పర్చారు. బుచ్చిలో అక్రమ ధాన్య నిల్వలు షరా మామూలు అయినప్పటికీ చిన్న గ్రామంలో 50పుట్ల నిల్వ పట్ల పలువురు ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నారు.

## తెలుగు తమ్ముళ్ల జేబుల్లోకి డిపాజిట్లు

పక్కా గృహాలు మంజూరు చేయిస్తామని ఆత్మకూరులోని కొందరు తెలుగు దేశం నాయకులు జేబులు నింపుకొంటున్నారు. ఇళ్లులేని పేద, మధ్యతరగతి వర్గాల వారి వద్ద నుంచి పక్కా గృహాలు మంజూరు చేయిస్తామని ఒక అర్జీతో పాటు డిపాజిట్ అంటూ రెండు వందల పదకొండు రూపాయలు దండుకొంటున్నారు. గతంలో కూడా ఈ విధంగానే తెలుగు తమ్ముళ్లు పెద్ద మొత్తంలో వసూలు చేసి చివరికి చేతులెత్తేసారు. ఆత్మకూరులో పక్కా గృహాలు మంజూరు చేసారా లేదా అన్న విషయమై గృహనిర్మాణ శాఖాధికారులు ఒక ప్రకటన విడుదల చేస్తే బాగుంటుంది.

## ఆర్టీసి బస్సుల్లో పనిచేయని టివిలు

ప్రైవేట్ బస్సుల నుంచి ఎదురౌతున్న పోటీని తట్టుకోను ఆత్మకూరు డిపో ఆర్టీసి అధికారులు పలు చర్యలు తీసుకొంటున్నారు. దీనిలో భాగంగా ఆత్మకూరు నుంచి నెల్లూరు వెళ్లే డబుల్ స్టాప్ బస్సుల్లో టివిలు ఏర్పాటు చేశారు. కాని ఈ టివిలు ఒక్కరోజు మాత్రం పనిచేసి మూలకొన్నాయి. ఈ బస్సుల్లో టివిలు ఏర్పాటు చేసి వున్నందున మామూలు ఛార్జీ 18 రూపాయలకు అదనంగా మరో 1.50 పైసలు వసూలు చేస్తున్నారు. కంపెనీ టివిలు కాకుండా స్థానికంగా తయారు చేసిన టివిలు పెట్టడం వల్లే ఈ దుస్థితి దాపురించిందని ఆర్టీసి ఉద్యోగులే చెప్తున్నారు. ప్రజల కాలక్షేపం కోసం టివిలు ఏర్పాటు చేసిన అధికారులు వీటిని మార్పించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

## సోమిరెడ్డి సీమంతాలకు పెద్ద - చిక్కాల!

ఈ మధ్య వార్తల్లో వెనుకబడిన సర్వేపల్లి శాసనసభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మహిళా జన్మభూమిలో ప్రత్యేక కార్యక్రమం చేపట్టి తానున్నాననిపించారు. మహిళా జన్మభూమి కార్యక్రమంలో సామూహిక సీమంతాల కార్యక్రమం వున్నా జిల్లాలోని ఏ అధికారపార్టీ శాసనసభ్యుడు దీన్ని నిర్వహించలేదు. చంద్రమోహన్‌రెడ్డి మాత్రం తోటపల్లి గూడూరు మండలం ఇస్కపాళెంలో జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి చిక్కాల రామచంద్రరావును పెద్దగా పెట్టి, జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ సమక్షంలో ఐదుగురికి సీమంతం జరిపించారు. వీరిలో ఒక్కొక్కరికి 1116 రూపాయలు చంద్రమోహన్‌రెడ్డి కానుకగా ఇచ్చారు. మీసగడ్డం మామను చూచి తల్లి గర్భంలోని పిల్లలు భయపడలేదు కదా?

## స్వర్ణాంధ్ర - స్వర్ణమృగం

*దుగ్గిశెట్టి వేంకటరమణయ్య*

బంగారులేడి విహరిస్తుంది ఆంధ్రలో
మగవారి కర్మభూమిలో
మగువల జన్మభూమిలో
పరుగిడుతుంది అలరిస్తుంది
ఎన్నిహొయలు - ఎన్ని మెరుపులు

మహిళల మంగళఫలంగా ప్రచరిస్తూ
తెగువగా - కరుకుగా - విజృంభిస్తూ
స్త్రీని మగవానితో సమం చేస్తానంటూ
మగవారి స్వేదఫలం హరిస్తూ
చిత్రవిచిత్ర గతులతో - రీతులతో
రాలుస్తూ స్త్రీలకే స్వల్పమో!
పెంచిన, ధరలు, పన్నులు కుటుంబాదాయన్ని హరించగా
ఆడవాళ్ల కందమైన కలల సృజిస్తూ
దీపం అంటూ - ఉండే దీపాన్ని ఆకాశదీపం చేస్తూ
దోచినవాణ్ణి వదలి - దోచనివాణ్ణి కుమ్ముతూ
కనక మృగం - పరాక్రమిస్తుంది
ఈ హరిణి - మానినుల మనోహారిణి
స్వర్ణమృగం వెంటబడటం - మృత్యుష్ణాన్వేషణేనా?

## కోవెరపాళెం తీరేవేరు!

జిల్లాలోని పలు గ్రామాల్లో జరిగిన జన్మభూమి గ్రామసభల్లో విద్యుత్ ఛార్జీల పెంపకంపై కాంగ్రెస్, సిపిఎం పార్టీలు నిరసన వ్యక్తం చేస్తున్నాయి. కాని తోటపల్లి గూడూరు మండలం కోవెర పాళెంలో అధికార పార్టీ కార్యకర్తలు సైతం దీనికి తమ మద్దతు ప్రకటించారు. కరెంట్ ఛార్జీలు తగ్గించే వరకు తమ గ్రామంలో అధికారిక సభలు, ప్రచార డప్పులు వద్దని తెగేసి చెప్పారు. ముసలివాళ్లు సైతం తమ పింఛన్లు తీసుకోను నిరాకరించడంతో అధికారులు ఆశ్చర్యపోతూ వెనక్కు తిరిగొచ్చారు. కోవెరపాళాన్ని ప్రతిగ్రామం ఆదర్శంగా తీసుకొంటె విద్యుత్ ఛార్జీలు తగ్గకుండా పోతాయా?

## జిల్లాకు 50వేల పొగలేని పొయ్యలు

మహిళలు ఆర్థికంగా, రాజకీయంగా, సామాజికంగా చైతన్యం పొంది ముందుకు సాగేందుకు అనువుగా రాష్ట్ర ప్రభుత్వం మహిళలకు ప్రత్యేకంగా పలు అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టినట్లు జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి చిక్కాల రామచంద్రరావు తెలిపారు. 7తేది వెంకటాచలం మండలం అనికేపల్లిలో జరిగిన గ్రామసభలో మంత్రి ముఖ్యఅతిధిగా పాల్గొని ప్రసంగించారు. రాష్ట్రంలో మూడు లక్షలా 50వేల మహిళా సంఘాలు ఏర్పడి 650 కోట్ల రూపాయలు పొదుపు చేశారు. మహిళలు ఇతరులపై ఆధారపడకుండా ఆర్థిక స్వామతను పెంపొందించుకోను తగిన సదుపాయాలు ప్రభుత్వం కల్పిస్తుందన్నారు. సర్వేపల్లి ఎమ్మెల్యే సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మాట్లాడుతూ వెంకటాచలం మండలంలో దీపం పథకం క్రింద వెయ్యి గ్యాస్ సిలిండర్లు ఇచ్చారు. అనికేపల్లిలో 50లక్షల మేర అభివృద్ధి పనులు చేసినట్లు చెప్పారు. జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ మాట్లాడుతూ జిల్లాకు 50వేల పొగలేని పొయ్యిలు కేటాయించారని, వీటిని మండలానికి వెయ్యి వంతున పంపిణీ చేస్తామన్నారు. ఇక్కడ కూడా చంద్రమోహన్‌రెడ్డి గర్భవతులకు సామూహిక సీమంతం నిర్వహింపజేశారు.

## కైవల్యా నదికి అడ్డుకట్టలు వేయండి

వెంకటగిరి సమీపంలోని వెలుగొండ అడవుల్లో పుట్టి గూడూరు సమీపంలోని పంబలేరులో కలిసే కైవల్యానది నాలుగు మండలాల గుండా సాగుతుంది. కాని ఈ నది నీటిని వినియోగించుకోవడం లేదు. ఈ నది నీటితో 10వేల ఎకరాలను సస్యశ్యామలం చేయవచ్చు. కైవల్యానది వెంకటగిరి, సైదాపురం, బాలాయపల్లి, డక్కిలి మండలాల గుండా పారుతుంది. ప్రతిఏటా వర్షాకాలంలో పరవళ్లు తొక్కుతూ పారుతూ ఈ నదీ జలాలు వృధా అయిపోవడం మినహా ప్రయోజనం లేకుండా పోయింది. ఒకవైపు ఈ నాలుగు మండలాల్లో భూగర్భ జలాలు అడుగంటి పోతున్నాయి. ప్రభుత్వం చేపడుతున్న నీరు - మీరు కార్యక్రమంలోనైనా ఈ నదికి అడ్డుకట్టలు వేసి నీరు నిల్వ చేస్తే ఎంతో ప్రయోజనంగా వుంటుంది. ప్రజా ప్రతినిధులు ఈ విషయమై కార్యాచరణ ప్రణాళిక రూపొందిస్తే బాగుంటుంది.

# గ్రామసభ

7వ పేజీ తరువాయి

బిజెపి నాయకులు రూములో పెట్టి తాళం వేశారు. గ్రామ పారిశుధ్యాన్ని 15రోజుల్లో సరిద్దుదితామని నోడల్ అధికారి, ఎమ్మార్వోచే హామీ పత్రం రాయించుకొన్నాకే, పెన్షన్లు పంచేందుకు అనుమతినిచ్చారు. అధికారులను రూములోవేసి తాళాలు పెట్టిన ప్రజలు కిటికీల్లోంచి వారితో సంభాషించారు. గతంలో నిర్వహించిన గ్రామసభల్లో వేలాదిగా అర్జీలు తీసుకొన్నారు. వీటిలో ఎన్ని పరిష్కరించారో చెప్పమన్నారు. 12 విడతలుగా జరిగిన జన్మభూమి కార్యక్రమాల్లో ఆత్మకూరులో పారిశుధ్యాన్ని సరిదిద్దమని వినతి పత్రాలిచ్చాం. ఎంతవరకు సరిదిద్దారు. ఒక్క సమస్యను పరిష్కరించలేదు; మళ్లీ సభను పెట్టను సిగ్గులేదా అని దుర్భాషలాడారు. పంచాయతీలో శానిటరీ శాఖకు మేస్త్రీ లేకపోవడం వల్ల ఈ దుస్థితి నెలకొందని ఎమ్మార్వో సర్దిచెప్పాలని ప్రయత్నించినా, ప్రజలు ఆయనను నోరుమూసుకోమన్నారు. గత్యంతరంలేని అధికారులు పారిశుధ్య సమస్యను 15రోజుల్లో పరిష్కరిస్తామని హామీ పత్రం రాసిచ్చి, బ్రతుకు జీవుడా అంటూ బయటకు వచ్చి, పెన్షన్లు పంచి ఈ కార్యక్రమం అయ్యిందనిపించారు.

# మూత్రపిండాల వ్యాధులకు రకరకాల కారణాలు!

మూత్రపిండాల వ్యాధులకు మంచి నిపుణుడు డాక్టర్ ఎస్.వి. కృష్ణారెడ్డి. పొగతోట లోని విజయా హాస్పిటల్‌లో ఆయన కార్యస్థానం. నెల్లూరులో ఉత్తమ ప్రమాణాలతో నడిచే ప్రైవేట్ నర్సింగ్ హోంలలో ఇది ఒకటి. మంచి వసతులే కాదు, మంచి నిర్వహణలోను శ్రద్ధ చూపుతున్నారు కృష్ణారెడ్డి గారు. డాక్టర్ - వయస్సులో యువకుడు; కాని అనుభవంలో


డా॥ ఎస్.వి. కృష్ణారెడ్డి
M.S., M.Ch. (Uro)
మూత్రపిండ వైద్యనిపుణులు

నిపుణుడు. మంచి హస్తవాసి కల్గిన డాక్టర్ అని పేరు.

మూత్ర పిండాల వ్యాధులపై ఆయన ఒక చక్కటి వ్యాసం వ్రాశాడు - చదవండి.

మూత్ర పిండాల సమస్యలు ప్రధానంగా నాలుగు రకాలు. అవి 1. మూత్రపిండాలలో రాళ్లు 2. మూత్రకోశ ఇన్‌ఫెక్షన్ 3. మూత్రంలో రక్తం పడడం 4. సంతాన లేమి.

మూత్రపిండాలలో రాళ్లు ఏర్పడడానికి రకరకాల కారణాలు వున్నాయి. మంచి నీళ్లు తక్కువగా తాగడం, వంశపారంపర్యంగా, ఎండోక్రైన్ లోపం, థైరాయిడ్ గ్రంధుల వల్ల, తీసుకునే ఆహార లోపాల వల్ల మూత్ర పిండాలలో రాళ్లు ఏర్పడుతాయి. పాలు, కాఫీ, పాల కూర, గోంగూర, క్యాబేజి వంటివి ఎక్కువగా తీసుకోవడం వల్ల కూడా ఈ సమస్య ఉత్పత్తౌతుంది.

ఈ రాళ్లు తొలగించేముందు అవి ఎందుకు ఏర్పడింది నిర్ధారణ చేయడం అవసరం. రక్త, మూత్ర పరీక్షలలో కారణాలు తెలుసుకోవచ్చు. హైపోసిట్రాటురియా వంటి సమస్యల వల్ల రాళ్లు ఏర్పడితే, రాళ్లతో పాటు ఈ సమస్యకు సైతం చికిత్స చేయాలి. లేకుంటే మళ్లీ రాళ్లు ఏర్పడే అవసరం ఏర్పడుతుంది. మూత్రంలో రక్తం పడడం, కడుపునొప్పి తరచు రావడం, మూత్రం వెళ్లే సమయంలో మంట, మూత్రం ఆగిపోవడం వంటి లక్షణాలు కన్పించిన వెంటే వైద్య నిపుణుడిని సంప్రదించాలి.

మూత్రకోశ ఇన్‌ఫెక్షన్: దీన్ని సిస్టైటిస్ అంటారు. మూత్ర విసర్జన ఎక్కువ కావడం, విసర్జన సమయంలో నొప్పి, మూత్రం దుర్వాసనతో రావడం వంటివి దీని లక్షణాలు. స్త్రీలలో ఇది ఎక్కువ. పురుష నాళం శుభ్రం చేసుకోకుండా రతిలో పాల్గొనడం వల్ల ఈ వ్యాధి వచ్చే అవకాశం వుంది. పురుషులలో ఇది రావడానికి ప్రధాన కారణం ప్రోస్టేట్ గ్రంధి పెద్దది కావడం. ఈ గ్రంధి యుక్త వయస్సులో ఒకసారి, 50 ఏళ్ల తర్వాత మరొకసారి పెరుగుతుంది. ఇది పరిమితి మించి పెరిగితే సమస్య. వెంటనే చికిత్స

తొరువ 9వ పేజీలో

# కట్టుడుపళ్ల బాధలు తప్పించే కొత్తదంతాలు

నెల్లూరు నగరంలో దంతాలకు సంబంధించి అత్యాధునిక ప్రోస్త్రొడాంటిక్స్, ఇమ్ప్లాంటాలజీ వైద్య ప్రక్రియపై నిపుణత కలిగిన ఒకే ఒక్క డాక్టర్ డి. నారాయణరెడ్డి. పొగతోటలో, వెంకటరమణా విలాస్ ప్రక్కన ఆయన "అడ్వాన్స్‌డ్ డెంటల్ హాస్పిటల్" వుంది. దంతాలు, నోరు, దవడ ఎముకల చికిత్స ఈ ఆస్పత్రి ప్రత్యేకత.

నారాయణరెడ్డి నిపుణత కేవలం చదువు వల్లనే రాలేదు. చదువుతో పాటు అనుభవంతో ఆర్జించిన విద్య ఆయనది. చండీగర్ పోస్ట్‌గ్రాడ్యుయేట్ ఇన్‌స్టిట్యూట్‌లో రెసిడెంట్‌గా, మద్రాసు అపోలో ఆస్పత్రిలో రిజిస్ట్రార్‌గా, మద్రాస్ శ్రీ రామచంద్రా మెడికల్ కాలేజీలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేశారాయన.

మొదట చెప్పినట్లు డాక్టర్ నారాయణరెడ్డి గారికి ఇంప్లాంటేషన్‌లో మంచి నిపుణత వుంది. ఇంప్లాంటేషన్ అంటే, అసలు దంతాలు తీసివేయవల్సినప్పుడు, వాటి స్థానంలో వాటివలె పనిచేసే కృత్రిమ దంతాలు అమర్చడం. కట్టుడు పళ్లు అనేది చాలా పురాతన ప్రక్రియ. కొత్త దంతాలు అమర్చడం వైద్య శాస్త్రం సాధించిన పురోగతి ఫలితం.

వున్న దంతాలు తొలగించినప్పుడు కట్టుడు పళ్లు విడిగా ఇచ్చేవారు ఇదివరకు; వీటితో చాలా సమస్యలు. ఆహారం నమిలేటప్పుడు, మాట్లాడేటప్పుడు ఇబ్బందిగా వుంటుంది. తరచూ దవడ నొప్పి వస్తుంది. ప్రతి రోజూ కట్టుడు పళ్లను బయటకు తీసి శుభ్రం చేయడం మరీ ఇబ్బందికర సమస్య. ఇవి ఎప్పటికీ కట్టుడు పళ్లు తప్ప అసలు దంతాలను మరిపించలేవు.

కొన్ని పళ్లు మాత్రం లేనివారికి బ్రిడ్జింగ్ విధానం ద్వారా, రెండు వైపులా మంచి దంతాలు సపోర్టుతో కొత్త దంతాలు బిగించే పద్ధతి ఒకటి వుంది. ఇది ఒకరకంగా కట్టుడు పళ్ల కంటే మెరుగు అన్నప్పటికీ, ప్రక్క దంతాలు ఆరోగ్యంగా లేకపోతే ఈ ప్రక్రియ పని చేయదు.

ఈ సమస్యలన్నిటికీ పరిష్కారం -


డా॥ డి. నారాయణరెడ్డి
M.D.S., (Osm)
Consultant Prosthodontist & Implantalogist

ఇంప్లాంట్ ట్రీట్‌మెంట్. అసలు పళ్లను మార్చించే విధంగా కొత్త దంతాలను దవడ ఎముకలలో బిగించడం ఈ ప్రక్రియ పోషం. కేవలం పదేళ్ల క్రితం ఆచరణలోకి వచ్చిన పద్ధతి ఇది. కొత్త దంతాలకు టైటానియం మెటల్ వాడుతారు. మొత్తం పళ్లు లేనివారికి, కొన్ని పళ్లు మాత్రం లేని వారికి కూడా ఇది పనిచేస్తుంది.

ఈ చికిత్స ప్రారంభించబోయే ముందు, దవడ ఎముకలను ఎక్స్‌రే తీసి అనువైన ప్రదేశం గుర్తిస్తారు. మొత్తం దంతాలను అమర్చడానికి 4 నుంచి 6 నెలల సమయం పడుతున్నది. ఈ లోపల ఇబ్బంది లేకుండా తాత్కాలిక దంతాలు అమరుస్తారు. ఒకసారి చికిత్స పూర్తి అయితే, ఇక దంతాల సమస్య వుండదు. చిన్ననాటి నుంచి వున్న దంతాల వలెనే వీటిని వాడుకోవచ్చు.

ఇప్పుడు ఈ దంతాలను విదేశాల నుంచి దిగుమతి చేసుకోవాల్సి వస్తున్నది. మన దేశంలో త్వరలో వీటి ఉత్పత్తి జరుగుతుందని చెప్తున్నారు. అదే నిజమైతే, చాలా చవక ధరలో ఈ చికిత్స జరిపించే వీలు కల్గుతుంది.

# ప్రపంచస్థాయి గుర్తింపు కల్గినా - పుట్టినింటి పట్ల ప్రేమ తగ్గలేదు!

దేశంలోని ప్రప్రథమంగా, పూర్తిగా గ్యాస్ట్రోఎంట్రాలజీకి అంకితమైన హాస్పిటల్ కట్టాలన్న తన కల నెరవేర్చుకున్న అదృష్టవంతుడు - డాక్టర్ కె. రవీంద్రనాథ్. రవీంద్రనాథ్ ప్రపంచ ప్రఖ్యాత వైద్య నిపుణుడు. మనవరకు


డా॥ కె. రవీంద్రనాథ్
M.D.S., (Osm)
Global Hospitals, Hyderabad

తొస్తే పరహారణాల నెల్లూరీయుడు. ఆత్మకూరు తాలూకా వాసి. వైద్య రంగంలో ఆకాశమంత ఎత్తుకు ఎదిగినా, నెల్లూరును, నెల్లూరీయుల సాన్నిహిత్యాన్ని వదులుకోని జన్మభూమి ప్రేమికుడు. ఇంగ్లాండులోని రాయల్ కాలేజి ఆఫ్ సర్జన్స్ సంస్థలో సభ్యత్వం సంపాదించుకున్న అరుదైన ప్రతిభావంతుడు. అంతర్జాతీయంగా పేరుకల్గిన గ్యాస్ట్రోఎంట్రాలజీ సూపర్ స్పెషలిస్టుల పేర్లు వ్రాయవలసి వస్తే మొదటి పదిమందిలో రవీంద్రనాథ్ పేరు వుంటుంది. ఆయనిప్పటి వరకు 13 వేల ఆపరేషన్లు చేశారని అంచనా; అందులో 10వేల ఆపరేషన్లు గాల్ బ్లాడర్‌కు సంబంధించినవి. పాంక్రియాస్‌లో రాళ్లు తొలగించడం ఆయనకు అరటిపండు వొలచి తిన్నంత సులభం. రోజుకు సగటున పది ఆపరేషన్లు చేస్తారాయన.

ఇందులో సులభంగా చేయగల్గిన లాప్రోస్కోపిలతోపాటు, అత్యంత క్లిష్టమైన పాంక్రియాసిస్, లివర్, బ్లూ డక్ట్ వంటివీ వుంటాయి. ఒక పాంక్రియాసిస్ ఆపరేషన్ చేయడానికి 3 నుంచి 4 గంటల సమయం పడుతుంది. దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు రవీంద్రనాథ్ ఎంతటి కష్టజీవి అన్నది. ఆపరేషన్ థియేటర్లో వున్నామంటే ఇంట్లో వున్నట్లే భావిస్తుంటారాయన. ఇంగ్లాండులో పని చేసేటప్పుడు రవీంద్రనాథ్‌కు భారత దేశంలో ఒక శాస్త్రీయ గాస్ట్రోఎంట్రాలజీ ఆస్పత్రి నిర్మించాలని కోరిక వుండింది. దాన్ని తీర్చుకోవడానికి హైదరాబాద్ బంజారా హిల్స్‌లో గ్లోబల్ హాస్పిటల్ స్థాపించారు. కేవలం డబ్బు సంపాదించాలనుకుంటే ఆయన ఈ ఆస్పత్రి కట్టనవసరం లేదు, కష్టపడవల్సిన పనిలేదు. ఇంగ్లండులో ఆయన ఆర్జన అపారం. కాని కన్న తల్లిని, జన్మభూమిని ప్రేమించేవారికి డబ్బు పట్ల మోజు వుండదు. రవీంద్రనాథ్ ఈ కోవకు చెందిన అరుదైన వ్యక్తి. అందువల్లనే ఆయన ఈ ఆస్పత్రిలో 15 శాతం పడకల పేద ప్రజలకు కేటాయించారు; వారికి అన్ని చికిత్సలు వుచితం; దీనితో పాటు నెల్లూరులో జరిగే మెడికల్ క్యాంప్‌లకు రవీంద్రనాథ్ సహాయం అన్ని రూపాలలో లభిస్తుంది. ఎంబిబిఎస్ చదవడమే ధనార్జన కోసం అన్న దృక్పథం బలీయంగా వున్న ఈ రోజుల్లో తన ప్రావీణ్యతను


డా॥ కె. రమేష్
MD Peds, MRCP (UK), MRCPCH(UK)
Consultant Pediatric Hepatologist & Gastroenterologist

పేదలకు వుపయోగ పెట్టాలన్న మంచి తలంపు కల్గడం, దాన్ని పట్టించడం నిజంగా అబ్బురమే కదా?

తన హాస్పిటల్‌లో లివర్ ట్రాన్స్‌ప్లాంటేషన్లు జరిపించాలన్నది రవీంద్రనాథ్ మరొక కోరిక. ఇప్పటి వరకు లివర్ ట్రాన్స్‌ప్లాంట్ సౌకర్యం ఇండియాలో లేదు. విదేశాలలో దీనికయ్యే ఖర్చు కోట్లలో వుంటుంది. ఇక్కడ

తొరువ 9వ పేజీలో

# కంటివైద్యంలో మేటి శివప్రతాప్

నెల్లూరులో కంటి వైద్యులు అసంఖ్యాకంగా వున్నారు. మొదటి నుంచి నెల్లూరు కంటి వైద్యానికి పేరు. ఇటీవల కాలంలో ఈ డాక్టర్ల సంఖ్య చాలా పెరిగి పోయింది. అది ఎంత పెరిగినా, డాక్టర్ శివప్రతాపరెడ్డి పేరు మాత్రం తగ్గడం లేదు. అందుకు కారణం ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు - ఆయన సమర్థతే ఆయన పేరును, ప్రాక్టీసును పదిలంగా నిల్పుతున్నది. కంటికి సంబంధించిన ఎటువంటి జబ్బు కూడా శివప్రతాపరెడ్డి చూపు పడగానే ఇట్టే దారికి పోతుంది; అదే ఆయన ప్రత్యేకత. బృందావనంలో వున్నది ఆయన లలిత కంటి ఆస్పత్రి. ఇటీవలి కాలంలో బాగా పెరిగిపోయిన డయాబెటిక్ రెటినోపతి వ్యాధిపై ఆయన సమాచారం, సలహాలు చదవండి. చక్కెర వ్యాధి వచ్చిన కొంత కాలం తర్వాత కంటిలోని రక్తనాళాలు, రెటినాలో సమస్యలు ప్రారంభమౌతాయి. ప్రారంభ దశలో వాటిని గుర్తిస్తే, పూర్తిగా అదుపు చేయవచ్చు; నిర్లక్ష్యం చేస్తే మాత్రం కంటి చూపు పూర్తిగా పోగొట్టే ప్రమాదకర సమస్య ఇది. డయాబెటిస్ వ్యాధి వచ్చిన ఐదేళ్ల తర్వాత కంటికి రక్త ప్రసారం



**డా॥ పి. శివప్రతాప్‌రెడ్డి**
M.S.,D.O.,
Consultant Ophthalmic Surgeon

చేసే నాళాలలో (రెటినల్ ఆర్టెరీస్) రక్తం చిక్కపడడం, రంధ్రాలు మూసుకుని పోవడం, కొత్త రక్త నాళాలు ఏర్పడడం జరుగుతుంటుంది. దీన్ని నిర్లక్ష్యం చేస్తే రక్త నాళాలు పూర్తిగా మూసుకొని పోతాయి; కంటిలో రక్త స్రావం జరుగుతుంది; రెటినా భాగం కంటి పొరల నుంచి విడిపోతుంది. కేవలం అయిదే నిముషాల వ్యవధి మాత్రం పట్టే చిన్న, సులువైన పరీక్ష ద్వారా ఈ లోపాలన్నింటినీ కనిపెట్టవచ్చు. మధు మేహం వ్యాధిని అదుపు చేసుకుంటే ఈ రకం రెటినా సమస్య తలెత్తదు. డయాబెటిస్ వున్నవారు మాత్రం ప్రతి సంవత్సరం ఈ పరీక్ష చేయించుకోవడం చాలా అవసరం. ముందు జాగ్రత్త పడితే కంటికి ప్రమాదం కలుగకుండా కాపాడవచ్చు. ఇది ఒక విచిత్రమైన జబ్బు. ప్రారంభ దశలో ఎటువంటి మార్పులు, లక్షణాలు కన్పించవు. అందువల్ల డయాబెటిస్ పేషంట్లు తమకు కళ్ల సమస్య రాలేదని పొరపడుతున్నారు. వారికి సమస్య అర్థమయ్యేటప్పటికి, రెటినా చెయిదాటి పోతున్నది. అందువల్ల ప్రతి చక్కెర రోగి కూడా తరచు ఈ పరీక్ష చేయించుకోవడం మంచిది. వ్యాధి ప్రారంభ దశలో కనిపెట్టగలిగితే, ఆర్గాన్ లేజర్ ట్రీట్మెంటు ద్వారా దెబ్బతిన్న రక్తనాళాలు సరిచేయడంతో పాటు, ఇతర కాంప్లికేషన్స్ రాకుండా అరికట్టవచ్చు. కంటి లోపల రక్తస్రావం వుంటే విటరెక్టొమి అనే ఆపరేషన్ చేసి, కంటిలోపల చేరిన చెడు రక్తాన్ని తీసివేసి, కన్ను శుభ్రం చేయాలి. కంటిలోని నరాలు తెగిపోతే, రెటినా డిటాచ్‌మెంట్ సర్జరీ ద్వారా, తెగిన నరాన్ని తిరిగి అతికించవచ్చు. దీనికి పలు పద్ధతులు వున్నాయి. కంటి పరిస్థితి బట్టి ఏ పద్ధతి వాడాలో డాక్టర్ నిర్ణయం తీసుకుంటాడు.



# సంతానం కల్గకపోవడానికి ఆడవాళ్లే కారణం కాదు!

1989లో నెల్లూరు పొగతోటలో గర్భకోశ వ్యాధుల ఆస్పత్రిని, 1991లో సంతాన సాఫల్య కేంద్రాన్ని ప్రారంభించారు. అనతికాలంలో ఇది జిల్లాలో అగ్రగామిగా ఎదిగింది. ఇంత వరకు ఐదువేల మంది సంతానం లేనివాళ్లకు చికిత్స చేసి, 60శాతం కేసులలో విజయం సాధించారు. లాప్రోస్కోపిక్ ఆపరేషన్‌లలో ప్రత్యేకత సాధించారు. దంపతులకు అవగాహన కోసం ప్రతి మంగళవారం సాయంత్రం ఆరున్నరకు 'ఓ పాపాలాలి' పేరుతో సిటీ కేబుల్ ఛానల్‌లో డాక్టర్ అండాళ్ భాస్కర్ సలహాలు, సూచనల కార్యక్రమం ఆసక్తికరంగా ఉంది.

సంతానం కలుగకపోతే డాక్టరును ఎప్పుడు సంప్రదించాలన్న విషయమై దంపతులకు స్పష్టమైన అవగాహన వుండాలి. ఒక సంవత్సరం పాటు, భార్యాభర్తలిద్దరూ ఎడబాటు లేకుండా ఉండి ఏ విధమైన కుటుంబ నియంత్రణ పద్ధతులు పాటించకుండా ఉన్నప్పుడు కూడా గర్భం రాకపోతే అప్పుడు డాక్టరును సంప్రదించాలి. పెళ్లైన సంవత్సరం లోపల గర్భధారణ జరగకపోతే ఇక గర్భం రాదన్న వాదనలో వాస్తవం లేదు. ఇది ఒక వదంతి మాత్రమే. ఎందుకంటే పెళ్లైన ఐదు లేదా పది సంవత్సరాల తర్వాత కూడా ఎంతో మంది గర్భం ధరించారు. సంతానం కలగక పోవడానికి ఆడువాళ్లని నిందించడం సమంజసం కాదు. బిడ్డల్ని కనేది వారే కాబట్టి వాళ్లనే నిందిస్తారు. వాస్తవాలను చూస్తే సంతాన లోపానికి ఆడవారు 25శాతం, మగవారు 33 శాతం, ఇద్దరూ కలిసి 25శాతం వివరించలేని కారణాలు 17శాతం ఉన్నాయి. సంతానం కావాలనుకున్న భార్యాభర్తలిద్దరూ డాక్టరును సంప్రదించాలి. ముందుగా మగవారికి పరీక్ష చేయాలి. తర్వాత ఆడవారికి పరీక్షలు చేస్తారు. మగవారికి చేసే పరీక్షల్లో ముఖ్యమైనది వీర్యం పరీక్ష. ఆడవారికి చాలా పరీక్షలు ఉంటాయి. చాలా సమయం పడుతుంది. అందుకని



**డా॥ అండాళ్ భాస్కర్**
M.D.,D.G.O.,
గర్భకోశ వ్యాధి వైద్యనిపుణులు

మొట్టమొదట మగవారికి పరీక్ష చేసి, అంతా నార్మల్‌గా ఉంటే అప్పుడు ఆడవారికి పరీక్షలు చేయడం మొదలు పెడ్తారు. ఒకవేళ వీర్య పరీక్షలో ఏమన్నా లోపం ఉంటే దానికి ట్రీట్‌మెంట్ ఇస్తారు. దీనికి ఎక్కువ టైము పట్టేటట్లయితే ఆడవారికి పరీక్షలు నెమ్మదిగా

తరువ 9వ పేజీలో

# మేలైన పరీక్షలకు కేంద్రం మెడినోవా

మెడినోవా అనేది కేవలం వైద్య సేవలు అందించే సంస్థ కాదు; అదొక వైద్య సౌకర్యాల ఉద్యమం, ప్రతి ఒక్కరికి భరించగలిగిన ఖరీదులో వైద్య సేవలు అందించడం మెడినోవా లక్ష్యం. సమాజంలో ఆరోగ్య పరిరక్షణపై చైతన్యం కల్గించడం మెడినోవా ఆశయం. ఈ ఉదాత్త ఆదర్శాలతో 1985లో ప్రారంభించిన ఈ సంస్థ అది కొద్దికాలంలోనే సర్వ సమగ్ర డయాగ్నొస్టిక్ కంపెనీగా అవతరించింది.

మన దేశంలో ఒక దశాబ్దం క్రితం వరకు సరైన రోగ నిర్ధారణ వసతులు లేవు. కార్పొరేట్ ఆస్పత్రులు ప్రారంభించిన తర్వాత, వాటిలో ఆధునిక వసతులు ఏర్పడినా, అవి సాధారణ డాక్టర్లకు, రోగులకు అందుబాటు కాలేదు. రోగ నిర్ధారణ సరిగా వుంటేనే ఎంత నిపుణుడైన డాక్టరైనా సరైన చికిత్స చేయగలుగుతాడు. మన నగరాలు, పట్టణాలలో కార్పొరేట్ ఆస్పత్రులకు వెళ్లే వారి సంఖ్య కంటే, ప్రైవేట్ ప్రాక్టీషనర్ల వద్దకు, నర్సింగ్ హోమ్‌లకు వెళ్లే రోగుల సంఖ్య పదింతలు ఎక్కువగా వుంటుంది. ఈ వర్గం ప్రజలకు, వైద్యులకు సేవ చేయడానికి ప్రారంభించింది - మెడినోవా. ఆనాటికి కార్పొరేట్ డయాగ్నొస్టిక్ సెంటర్లు అనే ప్రతిపాదన కొత్తది. ఒక రకంగా దేశంలో ఈ వైద్య సేవల రంగంలో మెడినోవా మార్గదర్శి అని చెప్పడం అతిశయోక్తి కాదు.

ఎంతో విశ్వాసంతో తన దగ్గరకు వైద్య పరీక్షల కోసం వచ్చే రోగులకు ప్రపంచ స్థాయి సౌకర్యాలు కల్పించడం తన విధానంగా భావిస్తుంది మెడినోవా; ప్రారంభం నుంచి, ఇప్పటి వరకు ఈ విధానం నుంచి ప్రక్కకు తప్పుకోలేదు. అందువల్లే డాక్టర్లు, రోగులు కూడా చిన్న ఆరోగ్య సమస్య వచ్చినా మెడినోవాకు వెళ్లి చూపించుకొంటే పోలేదా అని అంటున్నారు. అంతగా, ఇంటింటి సంస్థగా ప్రజల గుర్తింపు పొందడమే - మెడినోవా సాధించిన గొప్ప విజయం.

తను సాధించిన గుర్తింపును కాపాడుకోవడానికి మెడినోవా ఎప్పటికి అప్పుడు అత్యాధునిక వైద్య పరికరాలు సమకూర్చుకొంటున్నది. వాటిలో కొన్నిటి వివరం చదవండి.

అడ్వాన్స్‌డ్ ఇమాజింగ్: హిస్టోపాథాలజీ డయాగ్నసిస్ కోసం బయాప్సీ చేసేందుకు నెలకొల్పిన సిటి స్కానర్ అత్యంత నవీనమైనది. శరీరంలోకల స్వల్ప చెడు దోషాలను సైతం సున్నితంగా పరిశీలించి, నిర్ధారణ చేయడానికి స్పష్టమైన కంప్యూటరైజ్‌డ్ టోమోగ్రాఫిక్ స్కాన్ చిత్రాన్ని అందిస్తుంది ఇది.

గర్భధారణను తొలిదశలోనే గుర్తించి, నిర్ధారించడానికి ఆధునిక అల్ట్రా సౌండ్ స్కానర్ వుంది. శిశువు శరీరంలోని సూక్ష్మ అవయవాలైన థైరాయిడ్, కళ్లు వంటి వాటిని గుర్తించడానికి ఈ స్కానర్‌కు గల సున్నిత ప్రొబెలు వుపయోగపడతాయి.

వీటితోపాటుగా మరో పరికరం (మాగ్నెటిక్ రిసోనెన్స్ ఇమేజింగ్) పరికరం కూడా వుంది.

## మెడికల్ ల్యాబ్

మెడినోవాలో గల లాబొరేటరీ అత్యంత శాస్త్రీయమైనది. బయో కెమిస్ట్రీ, మైక్రో బయాలజీ, పాథాలజీ, హిస్టోపాథాలజీ, ఎండోక్రానాలజీ వంటి విభాగాలలో సమగ్ర పరీక్షలు జరిపించవచ్చు. రేడియో ఇమ్యునో అస్సే (RIA), ఎలిసా టెస్ట్ వంటి పరీక్షల ద్వారా హెచ్‌ఐవి, ట్యూమర్ మార్కర్స్, హార్మోన్ లోపాలు తదితర రోగాలను నిర్ధారించే వసతి వుంది.

హెమటాలజీ విభాగంలో బోన్ మారో బయాప్సీ చేయవచ్చు. క్లినికల్ కెమిస్ట్రీ ఆటో అనలైజర్ పరికరం పూర్తిగా ఆటోమాటిక్ ప్రక్రియలో నడిచే నవీన వసతి. పలు రకాల శాంపిల్స్‌ను, పలు రకాల పరీక్షలను ఒకేసారి ఖచ్చితంగా నిర్ధారించడం దీని ప్రత్యేకత.

## గుండె పరీక్షలు

గుండెకు సంబంధించిన పరీక్షల విషయంలో మెడినోవాలో గల వసతులు దేశంలోనే చాలా కొద్ది ఆస్పత్రులలో చూడగల్గుతాము. ఎకో కలర్ డాప్లర్, త్రీ ఛానల్ ఇసిజి పరికరం, కార్డిక్ స్ట్రెస్ సిస్టమ్ తదితరాలు లభిస్తాయి ఇక్కడ.

కేవలం పరికరాలే కాదు, వాటి ఆధారంగా చికిత్స చేయగల్గిన వైద్య నిపుణులు కన్సల్టెన్సీ ప్రాతిపదికలో లభిస్తారు ఇక్కడ. దాదాపు అన్ని సూపర్ స్పెషాలిటీ వైద్య విభాగాలకు నిపుణులు వున్నారు.

వీటితో పాటుగా, వినియోగదారుల సౌకర్యం కోసం మెడినోవా హెల్త్ కార్డ్, హెల్త్ చెకప్ వంటి ప్రత్యేక సౌకర్యాలు కల్పిస్తున్నది. మెడినోవాకు హైదరాబాద్‌లోని సోమాజిగూడలోని ప్రధాన కేంద్రంతోపాటు, హైదరాబాద్‌లోనే మరి నాలుగు ఫ్రాంచైజ్ కేంద్రాలున్నాయి. కలకత్తా, బెంగుళూరు, పూనే నగరాలలో శాఖలు వున్నాయి.

# దేవుడిచ్చిన అందం ప్రేక్షకులకే పందారం!

చిత్ర పరిశ్రమ నిజంగానే 'చిత్ర' పరిశ్రమ. దేవుడిచ్చిన అందాలను వెండి తెరపై ఆరబోసి పది మంది అభిమానులను, పది చిత్రాలను సంపాదించుకోవడం తప్పు కాదంటుంది రాధికా చౌదరి. అందాలు ఉండేది పది మందికి పందారం చేసేందుకు, పదిలంగా దాచుకొనేందుకు కాదని చెబుతోంది. క్రైమ్ చిత్రంలో ప్రభుదేవాతో కలిసి ఆడిపాడిన రాధిక చౌదరిని మాత్రం ఆ చిత్రం నిరుత్సాహపర్చింది. అయితే వచ్చిన అవకాశాలను రాధిక చక్కగా వినియోగించుకొంది. 'కణ్ణువ్వద పోగుదయ్యా' చిత్రంలో విజయకాంత్ సరసన నటించిన

## రాధికా చౌదరి

ఆమె వరుసగా ప్రియమానవళ్, క్రోథమ్, సింహాసనం చిత్రాల్లో అందాలను ఆరబోసింది. రాధికా చౌదరి సోయగాలకు తమిళ ప్రేక్షకులు మైమరవడంతో ఆమె చేతిలో ప్రస్తుతం ఆరు చిత్రాలున్నాయి.

### సిమ్రాన్ నాట్యంవెనుక....

సిమ్రాన్ పెద్ద అందగత్తె కాకపోయినా పాటల్లో ఆమె వేసుకొనే దుస్తులు, వేసే స్టెప్పులు ప్రేక్షకులను ఆకర్షించి ఎన్నో చిత్రాలను తెచ్చి పెడుతున్నాయి. దీనికంతటికి కారణం నృత్య దర్శకుడు రాజా సుందరం అట. సోయగాల సిమ్రాన్ అందాన్ని కన్నుల పిండుగా చూపించడంలో రాజాసుందరం ప్రత్యేక శ్రద్ధలు తీసుకొని మరీ డ్యాన్స్ మూమెంట్స్ కంపోజ్ చేస్తాడట. సిమ్రాన్ సీను, సీనులో వేసుకోవాల్సిన దుస్తులు కూడా ఎంపిక చేసేది రాజా సుందరమేనట. 'పార్తేన్ రసిత్తేన్' చిత్రంలో తాను నర్తించిన పాటను, వీడియో కెమరాలో చూసుకొని తన అందానికి స్టెప్పులకు, హొయలోలికించిన తీరుకు సిమ్రాన్ ఆశ్చర్యపో యిందట. సిమ్రాన్, రాజాసుందరం ప్రేమలో పడివున్నట్లు ఏడాదికిపైగా వార్తలొస్తున్నాయి. మరి ఎప్పటికి సిమ్రాన్‌కు చిత్రాలు తగ్గుతాయో, సుందరంను వివాహమాడుతుందో?

### షకలకబేబీగా రోజా

షకలక బేబీ చరణంతో ఒకే ఒక్కడు చిత్రంలో సాగే పాటలో నర్తించిన సుస్మితాసేన్‌కు ఎంతగానో గుర్తింపు తెచ్చింది. ఆ పాటే టైటిల్‌గా శివగామి ప్రొడక్షన్‌వారు తమిళంలో తీస్తున్న చిత్రంలో షకలకబేబీగా రోజా నటిస్తుంది.

### ఆ సినిమా విడుదలై వుంటే....

తాను రజనీకాంత్ సరసన హీరోయిన్‌గా నటించిన 'మనిదినన్ మని పిక్కమ్' సినిమా విడుదలై వుంటే తన భవిష్యత్తు మరో రకంగా వుండేదని క్యారెక్టర్ నటి వై. విజయ చెప్పింది. ఆ సినిమాలో నేనే సోలో హీరోయిన్‌ని. గ్లామర్‌తో పాటు పెర్‌ఫార్మెన్స్‌కు అవకాశం వున్న క్యారెక్టర్. నా దురదృష్టం కొద్దీ ఆ సినిమా విడుదల కాలేదు. అది విడుదలై వుంటే తప్పకుండా బిజీ అయ్యేదానినని వివరించింది. హీరోయిన్ అంటే పరిశ్రమలో ఇంత కాలం వుండేవారు కదా అంటే... హీరోయిన్ క్యారెక్టర్ చేయడం అంత సులభం కాదు. నాకు అవకాశం వచ్చినా కాలం కలిసిరాలేదు. ఏదీ మన చేతుల్లో లేదు, అంతా భగవంతుని లీల అని వై.విజయ నిట్టూర్చింది.

# కాసుల కోసమే శృంగారం

సినిమాల్లో శృంగార సన్నివేశాల్లో నటించడం కష్టమని, అందాల తార రాశి చెబుతోంది. అయితే మనుగడ కోసం, డబ్బు కోసం మనస్సును రాయి చేసుకొని వళ్లంతా చూపించేందుకు కూడా సిద్ధపడుతున్నామని చెప్పింది. తనను ఇబ్బంది పెట్టిన సరస సన్నివేశాలను గూర్చి చెబుతూ 'ప్రేయసిరావే' చిత్రంలోని

## రాశి

హీరో నా నాభి గూర్చి వరమా మాట్లాడుతూ, ముద్దుపెడు తుంటాడు. ఈ సన్నివేశాల్లో నటించను వళ్లు జలదరించింది. అయినా డబ్బు కోసం తప్పదు కాబట్టి ఒప్పుకున్నాను. పోస్ట్‌మెన్ చిత్రం హీరోకి నగ్నంగా భోజనం వడ్డిస్తానని చెప్పే సీను ఒకటుంది. క్లోజ్ షాట్స్ కొన్నిందని తీస్తారు. ఎలా నటించాలా అని తలపట్టుకొన్నాను. హీరో మోహన్‌బాబు నా బాధ అర్థం చేసుకొన్నారు. ఆ సన్నివేశ చిత్రీకరణ సమయంలో హీరో, నేను, కెమరామెన్, దర్శకుడు మాత్రమే వున్నాం. ముగ్గురితోనే ఆ సీనులో నటించానని చెబుతున్న రాశి, ఆ తర్వాత దాన్ని కొన్ని లక్షల మంది ప్రేక్షకులు చూస్తారని మర్చి పోయినట్లుంది. వాన పాటల్లో వళ్లు తడచి ముద్దయినప్పుడు సైతం నటించను కాస్త ఇబ్బందిగాను వుంటుందని రాశి బుంగమూతి పెట్టి చెప్పింది. నమ్మేవాళ్లు వుండాలే గాని సినీ చిత్రాంగులు ఎన్ని కబుర్లయినా చెబుతారు.

### రాణి ముఖర్జీ సైడు బిజినెస్

సినిమా పరిశ్రమలోని హీరోయిన్లకు ముందు చూపు లేకుంటే దెబ్బ తింటారంటుంది రాణిముఖర్జీ. ఈమె హీరోయిన్‌గా కొంచెం బిజీగా వున్నప్పుడే తనలోని వ్యాపార దృక్పథాన్ని తట్టిలేపింది. ఆర్.జె. అనే బేనర్‌పై టి.వి. సీరియల్ నిర్మాణాన్ని ప్రారంభించింది. 'మేహా

తారువ 15వ పేజీలో

# మీనా గాయని అయ్యింది

'పదినారు వయదినిలే' (పదహారేళ్ల వయస్సులో) పేరిట వెలువడిన తమిళ పాప్ ఆల్బమ్‌లో మీనా తొలిసారిగా సోలో గీతాలతో పాటు, డ్యూయెట్స్ కూడా ఆలపించింది. పది పాటలున్న ఈ పాప్ ఆల్బమ్‌లో ప్రముఖ దర్శకుడు భారతీరాజా

## హైదరాబాదు సినిమా వార్తలు

కుమారుడు మనోజ్, మీనాతో కలసి పాడడంతోపాటు నర్తించారు. ఈ ఆల్బమ్‌కు వసంతన్ అనే యువదర్శకుడు దర్శకత్వం వహించారు. ఈ కేసెట్ త్వరలో తెలుగులో సైతం రానుంది. ఈ ఆల్బమ్‌లో గాయనిగా నమ్మకం పెరిగిన మీనా త్వరలో మరోపాప్ ఆల్బమ్‌కు శ్రీకారం చుట్టనున్నట్లు ప్రకటించింది. కొత్త ఆల్బమ్‌లో హీరో విజయ్, హీరోయిన్ దేవయాని కూడా తనతో కలసి పాడి ఆడతారని చెప్పింది.

### బంగారు పతకం సాధించిన అమీషా

బద్రి, కహోనా ప్యార్‌హై చిత్రాల్లో నటించిన ప్రేక్షకాభిమానం పొందిన అమీషా పటేల్ చదువులోనూ ఫస్టే. అమెరికాలోని బోస్టన్ యూనివర్శిటీలో చదివిన అమీషా, ఎకనామిక్స్ బ్యాచిలర్ డిగ్రీలో బంగారు పతకాన్ని సాధించింది. తనలో చిన్నప్పుడు నాయకత్వ లక్షణాలుండేవని కాథెడ్రల్ స్కూల్లో, స్కూల్ పీపుల్ లీడర్‌గా కూడా పనిచేసినట్లు చెప్పింది. పెద్ద సంస్థలకు ఫైనాన్సియల్ అడ్వైజర్ కావాలనుకొనేదాన్ని, స్టేజ్ ప్రోగ్రాం లిస్తున్న నన్ను మిత్రులు మరీ ప్రోత్సహించేసరికి సినీ పరిశ్రమలోనికి కాలిడినట్లు చెప్పింది.

ఢిల్లీలో 2వ శేది ఉత్తమ పార్లమెంటేరియన్లకు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి ఇచ్చిన సన్మాన సభలో శత్రుఘ్నసిన్హా, సుష్మాస్వరాజ్‌లతో సుబ్బరామిరెడ్డి.

# "పెళ్లిసంబంధం" చెడగొట్టేశాడు

నిజ జీవితంలో తాతా మనవళ్లయిన అక్కినేని నాగేశ్వరరావు, సుమంత్‌లు, కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో తయారైన "పెళ్లి సంబంధం" చిత్రంలో తాతా మనవళ్లుగా నటించారు.

**చిత్రసమీక్ష**
**గ్రిద్దలూరు గోపాలరావు**

పురాణరత్నమైన భాగవతం రచించిన పోతన లాగా కామినేని సీతారాం (అక్కినేని నాగేశ్వరరావు) హలం పట్టి పొలం దున్ని సేద్యం చెయ్యటమేగాక, కలం పట్టి కవితా సేద్యం కూడా నేర్పుగా చేసి బంగారు పంటలు పండిస్తుంటాడు. ఆయన్ను అందరూ "కాశీ" అని పిలుస్తుంటారు. ఆయన వ్యవసాయ రంగంలోను, సాహితీ క్షేత్రంలోను పేరు ప్రఖ్యాతులు పొందాడు. అందరినీ ఆదరాభిమానాలతో చూస్తుంటాడు. సనాతన, అధునాతన పద్ధతుల పట్ల ఆయనకు సమాన గౌరవముంది. ఆయనకు కొడుకులు, కూతుళ్లు, తమ్ముళ్లు, అల్లుళ్లు, మనవళ్లు, మనవరాళ్లు వున్నారు. ఆ ఇంట ఆయన తాతగా వ్యవహరిస్తుంటారు. అందరికీ ఆయన పెద్ద దిక్కు, ఆయన వాక్కే అందరికీ అనుచరణీయం. ఆయన కుటుంబానికి సంబంధించిన 'కథే "పెళ్లి సంబంధం". కుటుంబం అన్న తర్వాత ఎన్నో సమస్యలుంటాయి. ఈ కుటుంబంలో ముఖ్యంగా మనవళ్లు, మనవరాళ్ల పెళ్లి సంబంధాల

తారువ 15వ పేజీలో

# వారఫలాలు

12-8-2000తేది నుండి 18-8-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిధునంలో రాహువు; కర్కాటకంలో కుజ, బుధ, సూర్యులు; సింహంలో శుక్రుడు మరియు 17తేది నుండి రవి; ధనుస్సులో కేతువు; ధనుర్మకర, కుంభ, మీనాలలో చంద్రుడు.

## మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆదాయం సుమారుగా వుంటుంది. కుటుంబ ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. శుభకార్య ప్రయాణాలు, ఖర్చులుంటాయి. పనులు చక్కగా సానుకూలం కాగలవు. విద్యా రంగంలో మంచి ప్రగతి చూపిస్తారు. అధికారులతో సన్నిహితంగా ఉండి అభిమానాన్ని సంపాదిస్తారు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. స్థిరాస్తుల క్రయవిక్రయాలు, నిర్మాణాల పంటివి తలపెట్టవచ్చును. బంధుమిత్రుల సహకారం పొందడం జరుగుతుంది.

## వృషభం
(కృత్తిక 2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆర్థికంగా పరిస్థితి బాగుంటుంది. శుభకార్యాల ఖర్చులు, ప్రయాణాలు ఉంటాయి. వ్యాపార విస్తరణ, పెట్టుబడుల వృద్ధి చేస్తారు. మిత్రుల సహకారం బాగుంటుంది. ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించాలి. అధికారుల అనుగ్రహం పొందుతారు. విద్యార్థులకు మంచి ప్రగతి ఉంటుంది. పెద్దల పరిచయాలు, అధికార వర్గంతో స్నేహం పెరుగుతుంది. సాంస్కృతిక రాజకీయ రంగాల వారికి మంచి ప్రోద్బలం వుంటుంది. శుభకార్య నిర్ణయాలు జరుగుతాయి. ఆరోగ్యం సరిగా ఉండదు.

## మిధునం
(మృగశిర 3,4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఆర్థికస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. విద్యార్థులు మంచి ప్రగతిని సాధిస్తారు. సాంస్కృతిక రంగాల వారికి సన్మానాలు, రాజకీయ వర్గాల వారికి ప్రజామన్నన, పలుకుబడి బాగుంటుంది. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది.

## కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేష)

అనుకున్న పనులు అనుకూలంగానే జరుగుతాయి. వారాంతంలో చిన్న చిన్న సమస్యలు ఏర్పడవచ్చును. శుభకార్యాలలో పాల్గొంటారు. శుభకార్య నిర్ణయాలు జరుగవచ్చును. వృత్తి, వ్యాపారపరంగా ఆదాయం పెరుగుతుంది. సన్నిహితులతో ఉన్న విభేదాలు కొనసాగుతాయి. కొత్త వస్త్రాలు, స్థిరాస్తుల లావాదేవీలు జరుగుతాయి. పెట్టుబడులపై లాభాలుంటాయి. ప్రముఖ వ్యక్తులతో పరిచయాలు ఏర్పడగలవు. కోపం, పట్టుదల ఎక్కువగా ఉంటుంది. సాంఘిక కార్యాలలో పాల్గొంటారు.

## సింహం
(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

నిర్ణయాలు జాగ్రత్తగా తీసుకోవాలి. లేకుంటే నష్టపోతారు. వారాంతంలో బంధువుల వల్ల శుభవార్తలు వింటారు. గౌరవ ప్రతిష్టలు బాగుంటాయి. వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. భూములకు, ఇండ్ల రిపేర్లకు ఖర్చులు పెడతారు. ఇతరుల అవసరాలకు ఆదుకొంటారు. అదనపు ఆదాయం, రావలసిన బాకీలు కొద్దిగా వస్తాయి. వ్యవసాయదారులకు బాగుంటుంది. అధికారుల వల్ల సమస్యలు రాగలవు. అనుకోని ప్రయాణాలు, శుభకార్యాలలో పాల్గొనడం జరుగుతుంది

## కన్య
(ఉత్తర 2,3,4పాదాలు, హస్త; చిత్త 1,2పాదాలు)

పనులు సరిగా జరుగక ఇబ్బంది పడతారు. ఆదాయం సరిగా ఉండదు. అనుకోని ఖర్చులుపైన బడి రుణం చేయవలసి రావచ్చును. రావలసిన బాకీలు నిలబడిపోతాయి. వారాంతంలో బంధు మిత్రుల సహాయం పొందుతారు. వ్యాపార రంగంలో వారు పెట్టుబడులు పెట్టే ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగార్థులకు అవకాశాలు వస్తాయి.

## పంచాంగం

### శ్రావణ పౌర్ణమి

15తేది మంగళవారం శ్రావణ పౌర్ణమి, స్వాతంత్ర్య దినోత్సవం.

### ముహూర్తాలు

13 తేది ఆదివారం ఉదయం 8.54గంటలకు కన్యాలగ్నాన వ్యాపార ప్రారంభ, వివాహాలకు 16 తేది బుధవారం రాత్రి 11.00గంటలకు మేషలగ్నాన గృహప్రవేశ, వివాహాలకు 18తేది శుక్రవారం ఉదయం 8.40గంటలకు కన్యాలగ్నాన ఉపనయన, వివాహ, గృహారంభ, వ్యాపారాలకు సుముహూర్తాలున్నాయి.

### ఆగష్టు తిథులు
శ్రావణ శుద్ధ

| | | |
|---|---|---|
| తేది 12 | శని త్రయోదశి | రా5.43గం.వ |
| తేది 13 | ఆది చతుర్దశి | పూర్తిగ |
| తేది 14 | సోమ చతుర్దశి | ఉ 7.45 గం.వ |
| తేది 15 | మంగళ పౌర్ణమి | ఉ9.30 గం.వ |
| తేది 16 | బుధ పాడ్యమి | ఉ 10.57 గం.వ |
| తేది 17 | బేస్త విదియ | ప 12.00 గం.వ |
| తేది 18 | శుక్ర తదియ | ప 12.32 గం.వ |

**స్వయంపాకుల శ్రీనివాసులు**, ఎం.ఏ.

## తుల
(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

ఆర్థిక ఇబ్బందులు తొలగుతాయి. రావలసిన బాకీలు, బంధుమిత్రుల ధనసహాయం లభిస్తుంది. అధికారిక పనులు జరుగుతాయి. ఉద్యోగులకు అధికారుల సహకారం పూర్తిగా లభిస్తుంది. స్థిరాస్తుల కొనుగోలు ప్రయత్నాలుంటాయి. ఉద్యోగావకాశాలు, సాంకేతిక రంగం వారికి లభిస్తాయి.

## వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. హామీలు ఇవ్వడం మంచిది కాదు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. కొత్తగా పెట్టుబడులు, వ్యాపార భాగస్వామ్యాలు ప్రారంభిస్తారు. తండ్రివర్గ బంధువుల అనారోగ్యవార్తలు వింటారు. ఉద్యోగ బాధ్యతల నిర్వహణ బాగుంటుంది. అధికారుల సహకారం బాగుంటుంది. కాని సహచరుల అసంతృప్తి తప్పదు.

## ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

శరీర ఆరోగ్యం సరిగా ఉండదు. సహాయపడవలసిన వార్లు తప్పుకొంటారు. వృత్తి, వ్యాపార, పరిశ్రమల రంగాలలో ఆదాయం బాగుంటుంది. కాని కుటుంబ ఖర్చులు, అధికారిక ఖర్చులు పెరుగుతాయి. ఉద్యోగార్థులకు అవకాశాలు లభిస్తాయి. విద్యార్థులకు విద్యాప్రగతి బాగుంటుంది. కుటుంబ సభ్యులతో విభేదాలు రావచ్చును. తండ్రి వర్గ బంధువులకు, బిడ్డలకు అనారోగ్య బాధలుంటాయి. ఉద్యోగులు విధి నిర్వహణలో జాగ్రత్తపడాలి. స్థిరాస్తుల క్రయవిక్రయాలు వాయిదా పడతాయి.

## మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

ఈ రాశి వారికి ఆశించినంత ఆదాయం ఉండదు. కుటుంబ సమస్యలు పరిష్కారానికి వస్తాయి. స్థిరాస్తులపై ఆదాయం లభిస్తుంది. పనులు అనుకూలంగానే జరుగుతాయి. ఉద్యోగస్థులు బాధ్యతల నిర్వహణలో శ్రమపడతారు. అధికార వర్గాల సహకారం బాగుంటుంది. అయితే అనవసర మానసిక ఆందోళన ఉంటుంది. బిడ్డలకొరకు ఎక్కువ ఖర్చులుంటాయి. శుభకార్యాలలో పాల్గొంటారు. కళా, రాజకీయ రంగాలలో ఎదురు దెబ్బలు తింటారు. ప్రోద్బలం ఉండదు. విద్యా ప్రగతి బాగుంటుంది.

## కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

నిలబడి పోయిన పనులు కొనసాగుతాయి. బంధుమిత్రులతో విభేదాలు సర్దుకొంటాయి. కార్య నిర్వహణకు, పలుకుబడి దక్షత ప్రదర్శించవలసి రావచ్చును. కుటుంబ సభ్యుల అనుకూలత బాగుంటుంది. ఉద్యోగులు అధికారులతో జాగ్రత్తగా మెలగాలి. ముఖ్యబంధువులకు అనారోగ్యం కలుగవచ్చును. వారాంతంలో అవసరాలేర్పడి రుణం చేయవచ్చును.

## మీనం
(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ రాశి వారికి ఆదాయం బాగానే ఉంటుంది. వ్యవసాయ రుణాలు, స్థిరాస్తులపై కొనుగోలు రుణాలు లభించవచ్చును. పనులు కొంత నిదానంగా జరుగుతాయి. అధికారుల సహకారం ఉద్యోగులకు బాగుంటుంది. విద్యా రంగంలో మంచి ప్రగతి చూపిస్తారు. కుటుంబ స్త్రీలకు అనారోగ్యం ఉండవచ్చును. వారాంతంలో శ్వాసకోశరుగ్మతలుంటాయి. కొత్త వస్త్రాలు కొనడం, శుభకార్యాలలో పాల్గొనడం జరుగుతుంది. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. సాంకేతిక రంగాల వారికి ఉద్యోగావకాశాలు రావచ్చును.

---

# జనవాణి

మూడవ పేజీ కొరవ

తేలుతారు. ఈ బస్సుల్లో ద్వంద్వార్థపు పాటలు, చెకింగ్ స్టాఫ్ అసభ్యపు మాటల మధ్య తప్పనిసరిగా ప్రయాణం చేయాల్సి వస్తుంది. రవాణాశాఖాధికారులు, ట్రాఫిక్ పోలీసులు ఒకసారి ఈ రూట్‌లో మాటు వేసి పరిస్థితులు చక్కబడితే బాగుంటుంది.

నెల్లూరు కె.లలిత

## బ్యాంకుల్లో ఏసి అవసరమా?

ప్రజల, ప్రభుత్వపు సొమ్ముతో లావాదేవీలు జరుపుతూ కేవలం కూడికలు, తీసివేతలకు పరిమితమైన బ్యాంకుల్లో ఎయిర్ కండీషన్లు ఎందుకో అర్థం కావడం లేదు. నెల్లూరులోని పలు బ్యాంకుల్లో మేనేజర్ ఛాంబర్‌లకు ఏసిలు, సిబ్బందికి కూలర్లతో చల్లని గాలివీస్తుంది. కాని వినియోగదారులు మాత్రం తడిచి ముద్దయ్యి కౌంటర్ల వద్ద తమ కార్యక్రమాలు పూర్తి చేసుకోవాలి. ఇది బ్యాంకర్లకు ఏ విధంగా న్యాయంగా తోస్తుందో అర్థం కావడం లేదు. వినియోగదారులు కూర్చొని, నిలబడి పనులు పూర్తి చేసుకొనేటట్లు ఫ్యాన్లు వేయిస్తే బాగుంటుంది.

నెల్లూరు జి.కృష్ణమూర్తి



## అంధకారంలో అయ్యప్పస్వామి

తుమ్మగుంటలోని అయ్యప్పస్వామి ఆలయంలో గతకొన్ని రోజులుగా అంధకారం అలుముకొనివుంది. ట్రస్టు బోర్డు ఛైర్మన్ అకాలంగా మరణించడంతో, విద్యుత్ బిల్లు చెల్లింపును సాకుగా చూపి కనెక్షను కట్ చేసారు. దీనివల్ల ఆలయానికి వచ్చి రాత్రిపూట నిదుర చేయాలని భక్తులు ఇబ్బందులు పడుతున్నారు. అవసరాలకు వాడుకోను నీళ్లు కూడా లేవు. కోవూరు ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి చొరవతీసుకొని ఆధ్యాత్మిక భావంగల వ్యక్తిని దేవాలయం బోర్డు ఛైర్మన్‌గా నియమించి పూర్వ పరిస్థితులను పునరుద్ధరించమని మనవి.

నెల్లూరు వి. పట్టాభిరామయ్య

## హృదయం పులకించి పోయింది

జూలై 21తేది జమీన్‌రైతులో ప్రొఫెసర్ కె.శేషాద్రిగారు వ్రాసిన నత్రం బడి జ్ఞాపకాలు ఎక్కడకో తీసుకెళ్లాయి. నేను ఆ బడిలోనే, ప్రొఫెసర్ శేషాద్రిగారు చదువుకున్న టీచర్ల వద్దనే చదువుకొన్నాను. శేషాద్రిగారు టీచర్లనందరి గూర్చి చెప్పారుకానీ, జాగ్రఫీ టీచర్ పాతపాటి శ్రీరాములును మర్చిపోయారు. నత్రం బడిలో క్లాసులు ప్రారంభమయ్యే ముందు కీర్తిశేషులు నేలనూతల రామకృష్ణయ్యగారు పిల్లల చేత చేయించే ప్రార్థనను కూడా ఈ స్కూల్‌లో చదువుకున్నవారు మర్చిపోలేరు. పాత సంగతులు నాతోటి విద్యార్థి వ్రాయగా చదివి నా హృదయం పులకించిపోయింది.

నెల్లూరు వి.రామచంద్రరావు

## జడ్పీ ఛైర్మన్ పదవిని బిసిలకు కేటాయించండి

సుదీర్ఘమైన చరిత్రకల్గిన నెల్లూరు జిల్లా పరిషత్ అధ్యక్ష పీఠంపై ఇంత వరకు వెనుకబడిన తరగతులకు చెందిన ఏ వ్యక్తి కూర్చోలేదు. జిల్లాలో అధిక సంఖ్యలో బిసిలు నివసిస్తున్నందున వారికి రిజర్వు చేసి, ఈ పదవికి అర్హులైన యువకుడు బీదా రవిచంద్రకు ముఖ్యమంత్రి అవకాశమివ్వాలి.

నెల్లూరు ఎస్.బాబు

## యాభైఏళ్ల క్రితం

మూడవ పేజీ కొరవ

వారు మాత్రం ముందుకొచ్చి చేస్తామని పూనుకొన్నందుకు ధన్యవాదాలు. వింటే భారతం వినవలె - తింటే వడలు తినవలె అన్నట్లు వడలతోనే ఈ నేతిపదార్థాలు ప్రారంభించ దలచుకొన్నారు.

మోపూరు వడ (నేతితో చేసినది) 15తేది స్వాతంత్ర్య దినోత్సవం దినం సాయంత్రం 7 గంటలకు ప్రారంభించబడును. రాత్రి 10 గంటల దాకా జరుగును. ఇది విజయవంతంగా జరిగిన అన్ని పదార్థాలు నేతితోనే చేయుటకు పూనుకొందురు. కావున ఎల్లరూ పాల్గొని వీరిని ప్రోత్సహించి తిరుగా నేతి పదార్థాలను దేశంలో పుపక్రమించుటకు సహాయపడుదురని మా ప్రార్థన.

### మంత్రుల రాక

20తేది నాడు పెన్నారు బ్రిడ్జి నిర్మాణ లాంచన ప్రారంభోత్సవం మంత్రి భక్తవత్సలం గారిచే జరుపబడును. శ్రీ గోపాలురెడ్డి గారు గూడ ఆ దినం వస్తారు. ఆ బ్రిడ్జికి కారకులైన, కృషికులైన, శ్రద్ధాళువులైన పై మంత్రులిరువురికి మా అభివాదములు.

### మరొక సూచన

ఈ కృషికి ప్రధాన పాత్రులు గోపాలరెడ్డి గారు కావున ఈ బ్రిడ్జి పేరు 'గోపాలసేతువు' అని పెట్టవలసినదిగా ఇది వరకు శ్రీ ఎం.ఎస్. నరసింహారావు గారు పత్రికలో వ్రాసి యున్నారు. ఇప్పుడు ఇతరులు కొందరు అర్జీలు పెట్టినట్లు గూడా తెలుస్తున్నది. ఏ మాత్రం ఉపకరించని వెంకటగిరి రాజాగారి పేరును మన్నేరు బ్రిడ్జికి పెట్టగా, రామచంద్రారెడ్డి గారి పేరును స్వర్ణముఖికి పెట్టగా - ఈ పెన్నారు బ్రిడ్జికి కొండంత కృషికి కారకుడైన గోపాలరెడ్డిగారి పేరును పెట్టుమనడం, సముచితమని వేరుగా చెప్పవలయునా?

### నెల్లూరు విద్యుత్కంపెని

థర్మల్ స్టేషన్ వచ్చే నెలలో నెల్లూరుకు విద్యుత్ సరఫరా చేయనుండడం సంతోషం కాని మధ్య యీ దళారీ నెల్లూరు పవర్ అండ్ లైటు లిమిటెడ్ ఎందుకు? నెల్లూరును దీకటి కొనను చేసి పేసిందే ఈ కంపెనీ! దీన్ని ప్రభుత్వం తీసికొమ్మని మొన్న మునిసిపాలిటీ కూడా తీర్మానించింది.

### ముఖ్యవార్తలు

#### కంచే చేనును మేసింది

నాసిక్‌లో, కరెన్సీ నోట్లు అచ్చు అయ్యే ప్రెస్‌లో 234 పది రూపాయల టావులు దొంగతనం పోయ్యాయి. ఒక్కొక్క టావులో 40 పది రూపాయల నోట్లు వుంటాయి. అప్పటికి మొత్తం 93వేల ఆరువందల రూపాయల విలువగల నోట్లు పోయ్యాయి. ఇప్పటికి 159 టావులు పట్టుబడ్డాయి. వీటితో గూడా నోట్లపై నెంబర్లు వేసేమిషన్ కూడా పోయింది.

#### యంత్రాలతో అభివృద్ధి

1918 నుంచి యంత్రాలతో వ్యవసాయం సాగించడం వల్ల అమెరికాలో 5కోట్ల 50లక్షల ఎకరాల భూమి అదనంగా సాగులోకి వచ్చింది. 1920 నుంచి నేటి వరకు ట్రాక్టర్లు ఏ విధంగా పెరిగింది, ఈ క్రింది సంఖ్యలు తెల్పుతాయి.

1920లో ట్రాక్టర్ల సంఖ్య సుమారుగా 2,50, 000, 1945లో సుమారుగా 5, 00, 000, ప్రస్తుతం సుమారుగా 35, 00,000.

#### నర్గీస్‌కు లక్షాయాభైవేలు

ప్రకాశ్ పిక్చర్స్ వారు కొత్తగా తయారు చేయబోతున్న చిత్రంలో నటించడానికి నర్గీస్‌ను తీసుకొన్నారట. ఆమెకు లక్షా యాభైవేల రూపాయలు ఇస్తారట.

## సణుగుడు

2వ పేజీ కొరవ

లకు విహార కేంద్రమై పోయింది. ఇంకె క్కడికి పోయినా వుద్యమం రచ్చ; ఇక్కడ మాత్రం ప్రశాంతత. ముఖ్యమంత్రి పర్యటనతో అది మరింత రుజువయ్యింది. రాష్ట్రంలోని ప్రతి జిల్లాలో వుద్యమకారులు నిరసనలు, ప్రశ్నలతో బహిరంగ సభలు జరుపుకోలేక చిక్కుక పోతుండిన చంద్రబాబు, నెల్లూరు జిల్లాలో తన సభ అంత పిన్‌డ్రాప్ సైలెన్స్‌తో జరగడం చూసి ఆనందపరవశుడైనారు. అందుకే చెప్పింది. ప్రభాకరరెడ్డి మొనగాడ న్పించుకున్నాడని. సాంప్రదాయసిద్ధ రాజకీయాలు తనకు తెలియకున్నా, తమ వారిని, ఎదుటి వారిని కూడా తన దారికి తెచ్చుకోవడం ద్వారా తన రాజకీయ చాతుర్యం ప్రదర్శించాడు ప్రభాకరరెడ్డి. ఆయన స్థానంలో ఇంక ఏ తెలుగు ఎమ్మెల్యే వుండినా, కరెంట్ వుద్యమం ఇంతగా నిర్వీర్యం అయ్యేదికాదు. కాంగ్రెస్ ఎమ్మెల్యేలతో ప్రభాకరరెడ్డి సాన్నిహిత్యానికి తాజా రుజువు మొన్న ఆయన్ను కమ్యూనిస్ట్ కార్యకర్తలు ఘెరావ్ చేయడానికి ప్రయత్నించినప్పుడు అదే కారులో నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి వుండడం. అది యాదృచ్ఛికంగా జరిగిన సంఘటన కావచ్చు. కాని వుద్యమ కార్యకర్తలు మంత్రిని అడ్డగిస్తున్నప్పుడు కాంగ్రెస్ ఎమ్మెల్యే మంత్రితో కలిసి ఒకే కారులో వుండడం సంచలనమే కదా? ఆ సంఘటన వల్ల తనకు రాజకీయంగా జరిగిన నష్టాన్ని పూడ్చుకోవడానికి వివేకా చాలా పెద్ద వివరణ ఇవ్వాల్సి వచ్చింది. నేను కాంగ్రెస్‌కు కట్టుబడిన వాడిని తప్ప, మంత్రితో కల్సిపోయేవాడిని కాను అని ప్రత్యేకంగా చెప్పుకోవాల్సి వచ్చింది. తనను జనం అనుమానంగా చూస్తున్నారన్న అనుమానం తనకు కల్గబట్టే కదా ఆ తాపత్రయం? ఆనం సంజీవ రెడ్డిగారు డిసిసి అధ్యక్షులుగా వున్నప్పుడు, జన్మభూమి కార్యక్రమం ప్రజలకు మేలు చేసేది అని ఒక్క ప్రకటన ఇచ్చినందుకు చాలా విమర్శ ఎదుర్కోవల్సి వచ్చింది; ఆనాడు ఆ విమర్శ చేసిన వివేకానందరెడ్డి, రాష్ట్ర మంతా కాంగ్రెస్ పార్టీ బహిష్కరించిన జన్మభూమి కార్యక్రమాల్లో పాల్గొన డంతో పాటు మంత్రితో కల్సి ప్రయాణం చేయడం ఎట్లా సమర్థనీయం అవుతుంది? ఈ నిజం వివేకాకు తెలియక పోలేదు. కాని ప్రభాకరరెడ్డి స్నేహం దాన్ని మరుపుకు తెచ్చింది. అదే మరి ప్రభాకరరెడ్డి సమర్థత. రాష్ట్రంలో మరొక తెలుగు మంత్రి కాంగ్రెస్ ఎమ్మెల్యేలను తమ కారులో ఎక్కించి తిప్పగల్గిన పరిస్థితి వున్నదా ఇప్పుడు? నెల్లూరు టౌన్‌లో కరెంట్ వుద్యమం నడపడానికి వివేకా చాలా తంటాలు పడింది వాస్తవం; చెవులో పూలు పెట్టుకొని, మీటింగులకు గొర్రెలు తోలి, అరెస్ట్ అయ్యి, రకరకాలుగా వుద్యమంలో పాలుపంచుకున్నది వాస్తవమే. కాని ఈ ఒక్క సంఘటనతో వివేకా రాజకీయ నిబద్ధత ప్రశ్నార్థమయ్యింది. నెల్లూరు జిల్లా రాజకీయాలలో వివేకా చాలా సీనియర్; పదవి లేట్‌గా వచ్చింది కాని, రాజకీయం పుట్టుకతో నేర్చినవాడు. ఇటువంటి వుద్యమాలు, వాటి పర్యవసానాలు బాగా తెల్సిన వాడు. ఎప్పుడు ఏ రీతిలో ఎవరితో వ్యవహరించాలో వివేకాకు ఒకరు చెప్పాల్సిన పనిలేదు. అటువంటి వాడిని బోల్తా కొట్టించి, సరిగ్గా ఆ సమయంలోనే తన కారు ఎక్కించుకుని, వుద్యమ కార్యకర్తల ముందు పరువు తీసిన ప్రభాకరరెడ్డి చాణుక్యం ముందు, వివేకా రాజకీయ అనుభవం ఎందుకూ పనికిరానిదై పోయింది. ఇప్పుడు చెప్పండి, ప్రభాకరరెడ్డి రాజకీయ మొనగాడా, కాదా? ఆరు నెలల లోపల ఇంత రాజకీయం నేర్చిన ప్రభాకరరెడ్డిని మంత్రిగా చేయడంలో చంద్రబాబు దూరదృష్టి అర్థం కావడం లేదా?

## కలాలకు

మొదటి పేజీ కొరవ

తన తప్పులను చీల్చి చెండాడడం చంద్రబాబుకు అసహనం కల్గించింది. తన మాట వినివారు ఎవరూ ఈ తెలుగు గడ్డపైన ఉపిరి పీల్చడానికి లేదన్నది ముఖ్యమంత్రి అహంభావ తత్వం. చవకబారు తెలుగు సినిమాలలో రాజకీయ వాదులు తమ శత్రువులపై ప్రదర్శించే విద్యలను మక్కికి మక్కి కాపీ కొట్టాడు ముఖ్యమంత్రి.

ఇండియన్ ఎక్స్‌ప్రెస్ యాజమాన్యం ఇటీవల 'నీ మనసు - నా మనసు' అనే సినిమా ప్రసార హక్కులు కొన్నది. ఐదు భాషలలో తీసిన చిత్రం ఇది. దానిపై రాష్ట్ర ప్రభుత్వం వినోదపు పన్ను రద్దు చేసేందుకు చంద్రబాబు నిర్ణయం తీసుకున్నాడు. దానివల్ల ఆ సినిమా టిక్కెట్ ధర రెండు రూపాయలకు దిగిపోతుంది. చూడాల్సిన చిత్రం కాబట్టి సినిమా ఎట్లా వున్నా జనం విరగబడి సినిమాహాళ్లకు వస్తారని, కోట్లకు కోట్లు లాభం జపురుకోవచ్చునని ఇండియన్ ఎక్స్‌ప్రెస్ యాజమాన్యం ఆశపడింది. ఈ సహాయానికి ప్రతిగా - ఆంధ్రప్రభ ఎడిటర్ శ్రీరామమూర్తిని తొలగించమని బేరం పెట్టాడు చంద్రబాబు. డబ్బు కక్కుర్తికి లొంగిన ఆ పత్రికా యజమానులు అప్పటికప్పుడు 3నెలల జీతం చేతిలో పెట్టి, ఆయన్ను ఇంటికి సాగనంపారు. తన మాట వినని పత్రికా సంపాదకులకు ఏ దుర్గతి పడుతుందో చేసి చూపించిన సంతోషంలో ముఖ్యమంత్రి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ యజమానులపై వరాల వాన కురిపించారు. రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో నడిచే ఎయిడ్స్ నివారణ ప్రాజెక్టు క్రింద వారికి ఒక కాంట్రాక్టు ఇప్పించడంతోపాటు, తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలిలో సభ్యత్వం కల్పిస్తానని వాగ్దానం చేశారట.

ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి పత్రికలపైన ఇంతటి పెత్తనం చలాయించడం, తనకు నచ్చని విలేఖరులు, సంపాదకులను సతాయించగల్గడం చరిత్రలో ఎప్పుడూ లేదు. అందులోనూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వంటి పత్రికతో ఆయన ఆటలాడగలగడం అత్యంత బాధాకర పరిణామం. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ అంటే నిర్భీతికి నిజాయితీకి నిర్భీగూటానికి పెట్టింది పేరు. స్వర్గీయ రామనాథ గోయంకా ఎమర్జెన్సీ రోజులలో ఇందిరాగాంధీపై జరిపిన సమరం చారిత్రాత్మకమైనది. ప్రభుత్వ ప్రకటనలు నిలిపివేసి, రౌడీలతో దాడులు చేయించి, పోలీసు కేసులు పెట్టించి నెలల తరబడి జైల్లో క్రుక్కినా - ఇందిరమ్మతో రాజీపడడానికి సిద్ధపడలేదాయన. ఇంకొక ప్రక్క రిలయన్స్ వంటి పారిశ్రామిక సంస్థల అక్రమాలపై పోరాటం చేశారు ఆయన. చిత్త శుద్ధి వృత్తిపర నిబద్ధత వల్ల - ఒక్క ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కే కాదు, యావత్ భారతీయ పత్రికా రంగం పట్లనే ప్రపంచమంతా గౌరవం ఇనుమడించింది. అంతటి మహోత్కృష్ట చరిత్ర కల్గిన పత్రికను సినిమా టిక్కెట్ల లాభానికి తెగనమ్మింది ప్రస్తుత యాజమాన్యం. రాజకీయవాదుల ఇష్టా ఇష్టాల ప్రకారం సంపాదకులను మార్చే నీచపు పనికి తన వారసులు పాల్పడ్డారని తెలిసి రామనాథ గోయంకా ఆత్మ ఎంతగా క్షోభిల్లుతుందో పాపం!

## చిత్రసమీక్ష

13వ పేజీ కొరవ

సమస్యలే తలెత్తుతాయి. కాశీ తమ్ముడు కృష్ణ(కోట శ్రీనివాసరావు) అల్లుడైన శ్రీనాథ్ (రఘువరన్) కూతురు పెళ్లి సంబంధం మొదటి సమస్యగా తయారవుతుంది. కాశీ, కృష్ణ ఈ తాత లిద్దరూ అల్లుడైన శ్రీనాథ్ కూతురు కావేరి పెళ్లి సంబంధాన్ని పరిష్కరిస్తారు. కావేరి, రాజా (రాజా రవీంద్ర) అనే అతన్ని ప్రేమించి వుంటుంది. కాని ఆమె తండ్రి శ్రీనాథ్ బలవంతంగా ఆమె పెళ్లి వేరొకనితో నిశ్చయిస్తాడు. పెళ్లి రోజున కాశీ తాత, కావేరి పెళ్లి ఆమె ప్రేమించిన రాజాతో రహస్యంగా రిజిస్టార్ ఆఫీసులో జరిపిస్తాడు. అది తెలియని ఆమె తండ్రి ఆమెను బలవంతంగా పెళ్లిపీటల మీద కూర్చొ బెట్టాడు. మంగళ సూత్రం కట్టే సమయంలో ఆమె మెడలో మరో మంగళ సూత్రం వున్నట్లు తెలుసుకొని అందరూ ఆశ్చర్య పోతారు. అది కాశీ తాత పన్నిన పన్నాగమని తెలుసుకున్న శ్రీనాథ్, కాశీ తాత మీద విరుచుక పడతాడు. కాని కావేరి ప్రేమ ఫలించేట్లు చేసిన కాశీ తాతకు అందరూ జేజేలు చెప్తారు.

ఈ పెళ్లిసంబంధం పూర్తిగాగానే మరొకటి ప్రారంభమవుతుంది. కాశీ తాత మనవడు వేణు (సుమంత్) శ్రీనాథ్ రెండో కుమార్తె కృష్ణవేణిని (సాక్షి శివానంద్) ప్రేమిస్తాడు. కృష్ణవేణి తండ్రి శ్రీనాథ్ ఆమె పెళ్లి మరొకరితో నిశ్చయిస్తాడు. కాశీ తాత జోక్యంతో వేణు, కృష్ణవేణి ప్రేమ కూడా ఫలిస్తుంది.

కథలో బలం లేదు. కొత్తదనం లేదు. సన్నివేశాల్లో సహజత్వం లేదు. ఒకసారి పెళ్లయిన కావేరిని మరో పెళ్లికి పెళ్లి పీటల మీద కూర్చొబెట్టడం, ఆ పెళ్లి కొడుకు మరో తాళి ఆమె మెడలో వున్నట్టు గమనించటం, పెళ్లి ఆగిపోవడం, ఇదంతా చాలా అసహజంగా, అనర్థంగా వుంది. హిందూ సాంప్రదాయాన్ని అవమానపరిచే విధంగా వుంది. ఇలా చిత్రంలో కొన్ని సన్నివేశాలు కృత్రిమంగా వున్నాయి. శ్రీనాథ్ విలనీ వికారంగా వుంది.

కథంతా కాశీ తాత పాత్రమీద నడుస్తుంది. యువతరానికి ప్రాధాన్యత య్యివ్వకుండా తాత, ముత్తాతలకు ప్రాముఖ్యత ఇవ్వటమేమిటి? ఈనాటి యువతీ యువకులు తల్లిదండ్రుల మాటలే పాటించటం లేదు. ఇక తాతలను ఖాతరు చేస్తారా? కాశీ తాత పాత్రను అక్కినేని నాగేశ్వరరావు ఉజ్వలంగా ప్రకాశింపజేశాడు. ఈ వయసులోను ఆయన యువతీ యువకులతో కలిసి "తలపాగా నెత్తిన చుట్టి దొరలాగా నడిచొస్తుంటే గుబేల్ గుబేల్" అనే పాటలో కుర్రాడిలా డ్యాన్సు చేశాడు. వేణు పాత్ర కాశీ తాత నీడలో నడిచింది. సుమంత్ ఈ పాత్రలో చలాకీగా నటించాడు. ఆ తర్వాత చెప్పుకోతగింది శ్రీనాథ్ పాత్ర. దీన్లో రఘువరన్ అతి అనిపించాడు. బ్రహ్మానందం హాస్యంలో సహజత్వం లోపించినా బాగా నవ్విస్తుంది. మిగతా పాత్రలను గురించి చెప్పుకోనవసరం లేదు.

పరుచూరి బ్రదర్స్ మాటలు పలుచగా వున్నాయి. ఎస్.ఎ. రాజ్‌కుమార్ సంగీతంలో రుచి లోపించింది. యువతీ యువకుల ప్రేమ ఫలించేందుకు పెద్దలు పాటుపడాలి అనే పాత్ర సందేశం వినసొంపైనా, చిత్రంలో వినోదం పేద తీరుస్తుంది.

## ఆదాల

4వ పేజీ కొరవ

అభివృద్ధి మండలి సమావేశంలో ప్రశ్నలతో ఆదాల ప్రభాకరరెడ్డిని ఉక్కిరి బిక్కిరి చేశాను. సాగునీటి సలహాబోర్డు సమావేశంలో రైతుల చేత మంత్రిని ఘెరావ్ చేయించిన విషయాన్ని గుర్తు చేసారు. అనేక సమస్యలపై ప్రజల మద్దతులో ఎన్నో వుద్యమాలను చేసి విజయం సాధించాను. నెల్లూరుటౌన్ దాటివెళ్లి కూడా విద్యుత్ ఛార్జీలు, జన్మభూమి కార్యక్రమాలను నిరసించిన విషయాన్ని వివేకానందరెడ్డి గుర్తుకు తెచ్చారు. ఇస్కపల్లి సభకు ముఖ్యమంత్రి వస్తారని తనకు తెలియనందువల్లే తాను తిరుపతికి వెళ్లానని, లేకుంటే ఎలాగోలా బకింగ్‌హాం కెనాల్ ద్వారానైనా అక్కడికి వెళ్లి నిరసన తెలియజేసి వుండేవాడినన్నారు.

## బియ్యం

4వ పేజీ కొరవ

కార్యక్రమాన్ని పకడ్బందీగా నిర్వహిస్తే జిల్లాలో రేషన్ కార్డులు లేని 45వేల మందికి కొత్తగా వీటిని ఇవ్వవచ్చు. కొత్త కలెక్టర్ ఈ విషయమై ప్రత్యేక దృష్టిని కేంద్రీకరించి, బోగస్ కార్డులు ఏరివేసి, కొత్త కార్డులిస్తే ప్రజలు పదికాలాల పాటు ఆయన పేరు చెప్పుకొంటారు.

## రాశి

13వ పేజీ కొరవ

కటిపరంగ్ అనే పేరుతో ఈమె తీస్తున్న సీరియల్ నిర్మాణ వ్యవహారాలను ఆమె సోదరుడు రాజాముఖర్జీనే చూస్తున్నాడు. సింపుల్‌గా జరిగిన ఈ ప్రారంభోత్సవ కార్యక్రమంలో రాణీ తండ్రి కొబ్బరికాయ కొట్టి పూజ చేశారు. అజయ్ మెహ్రో దర్శకత్వం వహిస్తున్న ఈ సీరియల్‌లో రోహిత్ భక్షి, సీమా కులకర్ణి, రాజేష్ ఖేరా, సుస్మితారావ్ నటిస్తున్నారు. తాను సినిమాల్లో సంపాదించిన డబ్బును వినోద ప్రధానమైన వాటికి ఉపయోగించి, సద్వినియోగం చేయాలను కొంటున్నట్లు రాణి చెప్పింది.

## నెల్లూరుసంగతులు

4వ పేజీ కొరవ

క్రింద 794 మందికి ఆర్థిక సహాయం అందజేశారు. బాలికా శిశు సంరక్షణ పథకం క్రింద 794 మందికి ఆర్థిక సహాయం చేశారు. జిల్లాలో 968 వైద్య శిబిరాలు నిర్వహించి 66,558 మందికి చికిత్స చేయడం తోపాటు, మందులు ఉచితంగా పంపిణీ చేశారు. 7839 వ్యక్తిగత కుటుంబ సమస్యలను అర్జీల రూపంలో ఇవ్వగా 112 పరిష్కరించారట. 1215 మంది బాలికలను కూడాపాఠశాలల్లో చేర్పించినట్లు కలెక్టర్ వివరించారు.

### ఇష్టులకు ప్రమోషన్లు తెలుగుగంగ ఎస్ఇతీరిది

తనను అన్నివిధాలూ సంతృప్తి పర్చిన వారికి నిబంధనలకు విరుద్ధంగా తెలుగుగంగ ఎస్.ఇ. ప్రమోషన్లు ఇచ్చేస్తున్నారు. దీంతో అర్హతలున్న వారికి అన్యాయం జరిగి పోతుంది. తెలుగు గంగ ఎస్ఇ జి.ఆర్. చిన్నారెడ్డికి తన క్రింద పనిచేసే వుద్యోగులంటే మరీ చులకన భావం. వారంతా తన దయాదాక్షిణ్యాల మీద బతుకు తున్నట్లు మాట్లాడుతుంటా రాయన. రాత్రి 10గంటలపైన ప్రత్యేక లాబీ నడిపే ఈ అధికారి, ఆ సమయంలో తనను ప్రసన్నం చేసుకొనే వారికి ప్రత్యేక రాయితీలు ఇస్తుంటారు. ఇటీవల కార్యాలయంలో పనిచేసే బ్లూ ప్రింట్ ఆపరేటర్‌కు ఇదే విధంగా ప్రమోషన్ ఇచ్చారాయన. అంతటితో ఆగక కార్యాలయంలో జూనియర్ అయిన మరో ఉద్యోగికి ఖాళీ అయిన సీనియర్ అసిస్టెంట్ స్థానంలో నియమిస్తున్నట్లు ఇటీవల ఉత్తర్వులు జారీచేశారు. వాస్తవానికి గూడూరులో పనిచేస్తున్న ఎల్‌డిసి జయరామయ్య ఈ పోస్టుకు అర్హుడు. తాను పబ్లిక్ సర్వీసు కమీషన్ పరీక్ష పాసైవున్నానని చెప్పినా ఎస్ఇ పట్టించుకోకుండా అర్ధరాత్రి ప్రమోషన్ ఉత్తర్వులు జారీ చేశారు. దీంతో జీవితంపై విరక్తిచెందిన జయరామయ్య ఆత్మహత్యా ప్రయత్నం చేయగా సహ ఉద్యోగులు రక్షించారు. పనుల్లో పర్సంటేజీలతో సరిపెట్టుకోకుండా చిన్నా చితక ఉద్యోగులపై కూడా తమ ప్రతాపం చూపడం ఎందుకండి ఎస్ఇగారు!

### నెల్లూరులో సన్మానం సంతోషాన్నిస్తుంది

సాహితీవేత్త డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అవార్డు ప్రధానోత్సవం టౌన్‌హాల్‌లో 5తేదీ వేడుకగా జరిగింది. సభకు మాజీ ఎమ్మెల్యే జె.కె.రెడ్డి అధ్యక్షతన వహించారు. సినీనటుడు అల్లు రామలింగయ్య జ్యోతి ప్రజ్వలన చేసి సభను ప్రారంభించారు. కస్తూరిదేవి విద్యాసంస్థల కరస్పాండెంట్ జె.వి.రెడ్డి గోపాలరెడ్డిలోని విశిష్ట గుణాలను వివరించారు. అనంతరం డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి స్మారక అవార్డును మద్రాస్‌లో సర్జన్‌గా పేరు ప్రఖ్యాతులు గాంచిన సిఎంకె రెడ్డికి ఇచ్చారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ అమెరికాలో వున్నత విద్యను అభ్యసించాను. కానీ నేను నేర్చిన వైద్య విజ్ఞానాన్ని సాటి భారత ప్రజలకు వినియోగించాలని నిర్ణయించుకొని స్వదేశానికి తిరిగి వచ్చినట్లు చెప్పారు. నా వారి మధ్య నాకు మన్ననలు లభించడం నా పూర్వ జన్మ సుకృతంగా భావిస్తున్నారు. చిన్నప్పుడు మా అమ్మ హితవు చెబుతూ, "నాయనా ఏ పని చేసిన ధర్మ సూత్రం అనుగతంగా వుండాలని" చెప్పేది. దాన్ని అనుసరించను నిత్యం ప్రయత్నిస్తుంటానని చెప్పారు. గోపాలరెడ్డి అవార్డు క్రింద ఇచ్చిన పదివేల రూపాయలను గోపాలరెడ్డి ఉమెన్స్ అకాడమీలో ఉత్తమ ఫలితాలు సాధించిన విద్యార్థులకు స్కాలర్ షిప్పులుగా ఇవ్వమని డాక్టర్ తిరిగిచ్చారు. అల్లు రామలింగయ్య మాట్లాడుతూ నెల్లూరీయుడైన పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి ప్రోత్సాహంతో తాను రంగస్థలం పై నుంచి సినీ రంగానికి వెళ్లినట్లు చెప్పారు. బెజవాడ గోపాలరెడ్డి మాదిరి ఆదర్శంగా వుండడం అందరికీ సాధ్యం కాదన్నారు. ఈ సందర్భంగా ఆర్థిక మాంద్యంతో సతమతమవుతున్న 21 మంది కళాకారులకు ట్రస్టు తరఫున ఆర్థిక సహాయం చేశారు. సభా ప్రారంభంలో డాక్టర్ యశోధర కుమార్తె స్ఫూర్తిశ్రీ చేసిన నాట్యం పలువుర్ని అలరించింది. సినీ నటుడు సుత్తివేలు కూడా పాల్గొన్న ఈ సభను అవార్డు కమిటీ కార్యదర్శి బి.వి. నరసింహం నిర్వహించారు.

### అరవిందుని జన్మదినోత్సవం

నెల్లూరులోని అరవింద సొసైటీ సెంటర్ మహాయోగి అరవిందుని 128వ జన్మదినోత్సవాన్ని 15తేదీ మూలపేటలోని సరస్వతి సమాజం ప్రాంగణంలో నిర్వహిస్తుంది. సభకు తిరుమల శెట్టి శంకరయ్య అధ్యక్షత వహిస్తారు. గూడూరు దివ్యజీవన సమాఖ్యకులు చదలవాడ వెంకటేశయ్య వుపన్యాసకులుగా విచ్చేస్తారని నిర్వాహకులు ఎం.రోశయ్య తెలిపారు.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354. Offset Printing at Zamin Ryot Press, Nellore